కేవలం విక్స్ వేపొరబ్ మాత్రమే
రొంప జమకూడే మూడుచోట్లా తక్షణం పనిచేస్తుంది...

# రాత్రికి రాత్రే
# రొంపను మాపుతుంది!




**విక్స్ వేపొరబ్ రెండు విధాల పని చేస్తుంది — రాత్రి అంతా కూడా — మీ ముక్కులోనూ, గొంతుకలోనూ, ఛాతీ లోనూ పనిచేసి, మీ రొంప బాధను దూరం చేస్తుంది.**

రొంపతాలిచిహ్నాలు కనబడగానే, ముక్కు వెంబడి చీమిడి కారడం, గొంతుపుండూ, ఛాతీలో భారం, ఈ చిహ్నాలు కనబడగానే, విక్స్ వేపొరబ్ ఉపయోగించండి. కేవలం విక్స్ వేపొరబ్ మాత్రమే రొంప జమకూడే ఈ మూడు చోట్లా అంటే ముక్కు, గొంతుకా, ఛాతీలలో వెంటనే పనిచేస్తుంది. రొంప బాధలను రాత్రికి రాత్రే దూరం చేస్తుంది. నిద్ర పోయేముందు, విక్స్ వేపొరబ్‌ను, ముక్కు మీదా, గొంతుకమీదా, ఛాతీమీదా, వీపుమీదా బాగా రాయండి. వెంటనే మీకు, విక్స్ వేపొరబ్ చర్మాన్ని వెచ్చగా చేయడం మీకు కనబడుతుంది. అదే సమయంలో మీ సొంత శరీరపు వేడి విక్స్ వేపొరబ్‌ను సత్వరం ఔషధాల ఆవిరిగా మార్చి వేస్తుంది. ఈ ఆవిరిని మీరు రాత్రంతా ప్రతిసారి ఊపిరి పీల్చినపుడల్లా లోనికి తీసుకొంటారు. ఈ అద్భుతమైన ద్వివిధచర్య, మీరు నిద్ర పోతున్నంతసేపూ జరుగుతూనే వుంటుంది. రొంప హెచ్చుగా బాధపెట్టే, ముక్కు, గొంతుకా ఛాతీలలో ఉపశమనం కలుగజేస్తుంది. ఉదయానికల్లా మీ రొంప చాలావరకు తగ్గిపోతుంది. మీరు తిరిగి ఆరోగ్యంగా ఆనందంగా వుంటారు.

| విక్స్ వేపొరబ్‌ను రొంపజమకూడే ఈ ప్రాంతాలలో మర్దనా చేయండి. | | |
|---|---|---|
| వేపొరబ్‌ను ముక్కులోపలా పట్టూరాయండి. | వేపొరబ్‌ను గొంతుకమీదా, ఛాతీమీదా మర్దనా చేయండి. | వేపొరబ్‌ను వీపు అంతటా రాయండి. |



పొదుపుగల ఇంటి సీసా



సాధారణపు నిలవు సీసా



సౌలభ్య ఆకు పచ్చ డబ్బా

# విక్స్ వేపొరబ్

కుటుంబములో ప్రతి ఒక్కరికీ —
రాత్రికి రాత్రే రొంపను మాపుతుంది.

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



ఇవి గాక ఫోటో శీర్షికల పోటీ, మరి ఎన్నో ఆకర్షణలు.










## పాఠకుల లేఖలు

### నవంబర్ 1963

ఈ నెల కథలన్నీ బాగున్నవి. "చందమామ మందహాసం" నన్నెంతో ఆకర్షించినది. గుండు భీమన్న కథ ప్రచురించకపోవడం ఏదో వెల్తిగా నున్నది.

—ఎస్. నరసింహారావు, తిరుమల

ఈ నెల "చందమామ" నాకు బాగా నచ్చింది... "ముగ్గురు మూఢులు" నాకు నచ్చలేదు.

—ఎస్. ధనేష్, ఉయ్యూరు

ఈ నెలలో వచ్చినటువంటి ఉత్తమమైన కథలు ఇదివరలో ఎప్పుడు రాలేదు.

—వి. ఎస్. కృష్ణయ్య, కోలార్

అట్టమీద నున్న హనుమంతుని చిత్రము నందలి రంగులు చాలా బాగున్నవి.

—గొట్టుముక్కల ప్రభాకరరావు, విజయవాడ

"చందమామ"తో సమానమైన పత్రిక నిజంగా మన దేశంలో లేదు.

—ఎ. సత్యనారాయణశర్మ, నెల్లూరు

"మూడు సూత్రాలు" చాలా బాగున్నది. "రాకాసిలోయ" చాలా ఆకర్షణీయంగా ఉన్నది. రచయితకు నా ధన్యవాదాలు.

—కె. వెంకటేశ్వరమ్మ, సోమిదేవరపాలెం

"రాకాసిలోయ" రసవంతముగా నడుస్తున్నది. "అభూతకల్పనలు", "మూడు సూత్రాలు", "ముగ్గురు మూఢులు" చాలా నైస్‌గా ఉన్నాయి.

—జి. లక్ష్మణరావు, విశాఖపట్నము

# ఫిలిప్స్






సంగీతములో శ్రేష్ఠమైనవి. మరెంతో నమ్మకమైనవి.




ఆథరైజుడు డీలరు

## మోడరన్ ఆటో స్టోర్సు

కాన్వెంటు వీధి......విజయవాడ-1.
ప్రకాశం రోడ్డు......విజయవాడ-2.
పోస్టాఫీస్ రోడ్డు...... గుడివాడ.

| |
|---|
| రేడియోలు |
| దీపములు |
| ఫిట్టింగులు |

NVKR

SUN



# వాక్యూమ్ ఫ్లాస్క్‌లు

అదర్శప్రాయమైన

## దీపావళి

కానుక.

అటువంటప్పుడు బహుమతులు ఎంచుకొను సమస్యలను గురించి మీ కెందుకు హృదయాందోళన?

దీపావళీ పర్వసమయాన మీ కమనీయమైన సందేశాలను శుభాకాంక్షలను సన్ వాక్యూమ్ ఫ్లాస్కుల ద్వారా అందజేయండి.



విక్టరీ ఫ్లాస్క్ కంపెనీ ప్రై. లి.,

బొంబాయి - కలకత్తా - ఢిల్లీ - మదరాసు

vapi -7-63

తప్పక చూడండి!

Studio SARAGAM




ఆర్.ఆర్.పిక్చర్స్ వారి

# మంచీ-చెడూ

TARAKA

| దర్శకత్వం | మాటలు, పాటలు | సంగీతం | కెమెరా |
|---|---|---|---|
| రామన్న | ఆచార్య ఆత్రేయ | విశ్వనాథం-రామమూర్తి | M.A. రెహమాన్ |

విజయ రిలీజ్



కర్తవ్య
నిర్వహణలో మొదటి
వరుసలో...

మన సైనికులలో శక్తి ఉత్సాహములకు కొదువ
లేదు మరియు రుచికరమైన, శ్రేష్ఠ మయిన
మరియు శక్తిదాయకమైన జె.బి. మంఘారామ్స్
బిస్కట్లు మరియు మిఠాయిలు వారికి ఉత్సాహము
మరియు అధిక శక్తిని యిస్తాయి. వారి కఠినమైన
జీవనములో యివి వరప్రసాదము!









# జె.బి. మంఘారాం అండ్ కం.

గ్వాలియర్ అండ్ హైదరాబాదు

వివిధ రకముల బిస్కట్లు మరియు కన్ఫెక్షనరీ తయారుతో
అత్యంత ఘనమైన జాతీయ సంస్థ.









JB-186A TEL



# చందమామ

సంచాలకుడు: 'చక్రపాణి'

ఈ నెల "ప్రపంచపు వింతలు" శీర్షికలో ప్రచురించిన అబూ సింబెల్ ఆలయాన్ని గురించి ప్రస్తుతం అంతర్జాతీయ కృషి జరుగుతూన్నది. అశ్వాన్ డామ్ నిర్మాణం వల్ల ఈ కట్టడాలను ఉన్నచోటు నుంచి తొలగించి, ఎత్తుగా కొండ పైన పునర్నిర్మించాలి. ఇందుకు సుమారు 15 కోట్ల రూపాయలు ఖర్చవుతుందట. ఇందులో 5 కోట్లు యునైటెడ్ అరబ్ రిపబ్లికు భరిస్తుందట. యునెస్కోలో సభ్యత్వం గల 43 దేశాలు ఇప్పటికి 3 కోట్ల చిల్లర రూపాయలు వాగ్దానం చేశాయి. అంచనాలను మించకుండా ఈ కట్టడాల ఉద్ధరణ జరిగే పక్షంలో అమెరికా మొత్తం ఖర్చులో మూడవ వంతు ఇవ్వటానికి సిద్ధంగా ఉన్నది. ఈ పని 1969 కి పూర్తి అవుతుందట.

సంపుటి: 33 - నవంబర్ 1963 - సంచిక: 5











# భారత చరిత్ర



ఘియాసుద్దీన్ మరణించిన మూడు రోజుల అనంతరం రాజకుమారుడు జౌన ముహమ్మద్ బిన్ తుఘ్లుక్ అనే పేరుతో తాను సుల్తానుగా ప్రకటించుకుని, మరి 40 రోజులకు ఢిల్లీకి వచ్చి అత్యంత వైభవంగా రాజ్యాభిషేకం చేసుకుని, ప్రజలకు వెండి బంగారాలూ, అధికార్లకు బిరుదులూ పుష్కలంగా అర్పించాడు.

ఇతను అతి విచిత్రమైన వ్యక్తి. ఇతను మహా మేధావో, పిచ్చివాడో, రక్తదాహం కలవాడో, సాధువో నిర్ణయించటం కష్టం. అతనికి అనేక శాస్త్రాలలో అసమాన పాండిత్యం ఉన్న మాట ఖాయం. యోధుడుగా కూడా అతని అపజయాలు బహుకొద్ది, విజయాలు అధికం.

నిత్య జీవితంలో కూడా అతనికి ఆ కాలపు వ్యసనా లేమీ లేవు. అంతు లేకుండా దాన ధర్మాలు చేసేవాడు. అయితే అతనికి పుస్తక జ్ఞానం ఉన్నంతగా జీవితానుభవ జ్ఞానం లేకపోయింది. ఆయన పథకాలు సిద్ధాంత రీత్యా అద్భుతంగా ఉండేవి, కాని వాటిని అమలు చేసేసరికి ఉపద్రవాలు కలిగేవి. దీనికి తగ్గట్టుగా అతను ముక్కోపి, తొందరపాటు గలవాడు. ఎదురు చెబితే సహించేవాడు కాడు. తన విధానాలు విఫలమైన కొద్దీ అతని మనస్సు మరింత గందరగోళం చెందింది. ప్రజలకు మేలు జరగాలని ఏవో చర్యలు చేసి, వాటి వల్ల ప్రజలకు ఆనందం కలగక పోయేసరికి, వారిని కృతఘ్నులని నిందించి వారి పట్ల క్రూరంగా ప్రవర్తించాడు.

గంగా యమునల మధ్య ఉండే "దో అబ్"లో తుఘ్లుక్ పన్నులు హెచ్చించాడు. అది సారవంతమైన ప్రాంతం. కాని అక్కడ కరువు వచ్చిన సమయంలో ఈ అదనపు పన్నులు వచ్చి పడ్డాయి.

## 26. "పిచ్చి" తుఘ్లుక్

వాటిని అధికారులు క్రూరంగా వసూలు చేశారు. రైతులు పొలాలు వదిలి పెట్టి పారి పోయారు. వారిని తిరిగి రప్పించటానికి సుల్తాను క్రూరమైన శిక్షలు అమలు చేశాడు.

తుఘ్లుక్ (1327) తన రాజధానిని ఢిల్లీ నుంచి దౌలతాబాద్‌కు (దేవగిరికి) మార్చటం కూడా సదుద్దేశంతో చేసిన పనే. దో అబ్, పంజాబు, లాహెూరు మైదానాలూ, ఉత్తర తీరాన గుజరాతు, తూర్పున బెంగాలు, దక్షిణాన దక్కను చేరి ఉన్న రాజ్యానికి ఢిల్లీ కన్న దేవగిరి కేంద్రస్థానం.. అదీగాక, ఢిల్లీలాగా అది మంగోలుల దాడికి గురికాదు.

రాజధాని చేసే నిమిత్తం దేవగిరిలో తుఘ్లుక్ అద్భుతమైన భవనాలు కట్టించాడు. విశాలమైన రహదారి వేయించి దాని కిరు వైపులా నీడ నిచ్చే చెట్లు నాటించాడు. ఢిల్లీ దౌలతాబాదుల మధ్య తపాలా ఏర్పాటు చేయించాడు. దౌలతాబాదుకు వలస వెళ్ళే వారికి పుష్కలంగా ధనం ఇచ్చాడు.

కాని ఢిల్లీ వాసులు కొందరు తమ ఇళ్ళు వాకిళ్ళు వదిలి వెళ్ళటం బాధగా ఉన్నదనే సరికి సుల్తాను వెర్రెత్తిపోయి, ఢిల్లీలోని వారందరూ తమ సామాన్లతో సహా దౌలతాబాదుకు ప్రయాణం కావాలని అజ్ఞాపించాడు. ఈ ప్రయాణంలో జరిగిన ఘోరాలన్నిటినీ



మనం నమ్మకపోయినా, 700 మైళ్ళ ప్రయాణం ఎంతో కష్టమైనదై ఉండాలి. దారిలో చాలామంది చచ్చారు. దౌలతాబాదు చేరిన తరవాత కాందిశీకుల మనస్తత్వం ఏర్పడి మరికొందరు చచ్చారు.

అప్పటికి సుల్తాను తన పొరపాటు గ్రహించి, తన రాజధానిని తిరిగి ఢిల్లీకి మార్చి, ప్రజలను తిరిగి పొమ్మని అజ్ఞాపించాడు. ఢిల్లీకి ప్రాణాలతో తిరిగి వచ్చిన వారు బహుకొద్దిమంది. ఢిల్లీ శోభ అంతా పోయి పాడుబడినట్టయిపోయింది. దానికి తిరిగి కళాకాంతులు రావటానికి చాలా కాలం పట్టింది.

1329-1330 మధ్య సుల్తాను రాగితో చేసిన సంకేత నాణాలు ప్రవేశపెట్టాడు. ఇది గొప్ప విప్లవచర్య. అయితే ఈ నాణాలు ప్రభుత్వ టంకసాలలో మాత్రమేగాక ఎవరు పడితే వారు ఇళ్ళలో కుప్ప తెప్పలుగా తయారు చెయ్యటం చేత ఆర్థిక దుస్థితి ఏర్పడింది. "ప్రతి హిందువుడి ఇల్లూ ఒక టంకసాల అయింది. సంకేత నాణాలు లక్షల, కోట్ల సంఖ్యలో ఉత్పత్తి అయాయి. గ్రామాధికారులూ, భూస్వాములూ అపార ధనికులయిపోయారు. ప్రతి కమసాలీ రాగి నాణాలు చేశాడు. వీటితో ఖజానా నిండి పోయింది," అని చరిత్రకారులు రాశారు.

ఈ ఘోరం నాలుగేళ్ళ పాటు సాగినాక తన తప్పు తెలుసుకుని తుఘ్లుక్ రాగి నాణా లన్నిటినీ వెండి బంగారాలతో కొన యత్నించాడు. ఆయన పోగు చేసిన రాగి నాణాల రాసులు నూరేళ్ళ తరవాత కూడా తుఘ్లుకా బాదులో గుట్టలు గుట్టలుగా కానవచ్చాయి.

1328-29 లో ట్రాన్స్ ఆక్సియానా నుంచి చఘాతయీ నాయకుడు, తర్మాషీరీన్ ఖాన్ ఇండియా పై దండెత్తి వచ్చాడు. ఈ దాడి ఎలా జరిగిందో అలాగే అంత మయింది. తుఘ్లుక్ శత్రువును ఓడించాడో, లంచం పెట్టి పంపేశాడో స్పష్టంగా తెలియదు.

ఇండియాకూ, చీనాకు మధ్య ఉండే కరజల్ పర్వతాన్ని పట్టుకోవటానికి 1337-38 లో తుఘ్లుక్ ఒక పెద్ద సేనను పంపాడు. అననుకూలమైన ప్రదేశం కావటం వల్లా, వర్షాల వల్లా, సరఫరాలు తరిగిపోయీ ఢిల్లీ సేనలు చివరకు అగచాట్లకు గురి అయి, విపరీత నష్టం పొందాయి. తిరిగి వచ్చిన వారి సంఖ్య పదిమంది అని ఒక చరిత్రకారుడూ, ముగ్గురేనని మరొక చరిత్ర కారుడూ చెప్పారు. అయితే దాడి ఆశయం నెరవేరింది. ఆ ప్రాంతపు కొండవారు ఢిల్లీ అధిపత్యం ఆమోదించి, కప్పం చెల్లించారు.






# మహాభారతం

గాంధారీ ధృతరాష్ట్రులు వనవాసం వెళ్ళటంతో హస్తినాపురం కళా కాంతీ లేనిదయినట్టయింది. పాండవులు రాజ్యాపాలనా, వేదపఠనమూ మానేసి అస్తమానమూ దిగులులో మునిగి ఉండి, ప్రత్యేకించి తమ తల్లి అయిన కుంతిని తలుచుకుని లోలోపల కుళ్ళసాగారు. నగరంలోని పౌరులు కూడా మాట్లాడుకునేటందుకు మరేమీ లేనట్టు ముసలి రాజును గురించీ, ఆయనకు కలిగిన పుత్రశోకం గురించీ, కుంతీ గాంధారీలను గురించీ, విదుర సంజయులను గురించీ కథలు చెప్పుకుంటూ సంతోషం లేకుండా ఉండిపోయారు.

ముసలివాళ్ళు వెళ్ళిపోయేసరికి పాండవులకు ముందూ, వెనుకా కూడా శూన్యం ఏర్పడింది. అభిమన్యుడూ, ఉపపాండవులూ యుద్ధంలో పోయారు. వారిని తలుచుకున్నా దుఃఖమే, తమ ముందు తరానికి చెందిన వాళ్ళేమో అరణ్యానికి వెళ్ళిపోయారు. వారు బతికున్నారో, చచ్చారో కూడా తెలీదు. వారిని తలుచుకున్నా బాధే. ఈ బాధల మధ్య ఒక్క పిసరు ఆనందం ఇవ్వటానికి పరీక్షిత్తు ఒక్కడే ఉన్నాడు.

చిట్టచివరకు అందరి మనస్సులోనూ ఉన్న గాఢమైన వాంఛను సహదేవుడే పైకి లాగాడు. అతను ధర్మరాజుతో, "అన్నా, నీకు అడవికి వెళ్ళి మనవాళ్ళను చూడాలని ఉన్నది, నాకు తెలుసు. నాకు అమ్మను చూడాలని ఉన్న కోరికను బయట పెట్టటానికి భయపడ్డాను. ఆవిడ ఎలా ఉన్నదో! ఏం కష్టాలు పడుతున్నదో!" అన్నాడు.

వెంటనే ద్రౌపది కూడా బలంగా మాట వేసింది. "అత్తయ్యను ప్రాణాలతో మళ్ళీ చూస్తామా? నేనే కాదు, స్త్రీ జనమంతా గాంధారీ ధృతరాష్ట్రులనూ, కుంతీదేవినీ చూడాలని తహతహలాడుతున్నారు.

అట్ట చివరి బొమ్మ



ప్రయాణం కోసం వారు ముని వేళ్ళ మీద ఉన్నారు,'' అన్నది.

ధర్మరాజు వెంటనే ప్రయాణ సన్నాహాలకు ఉత్తరువిచ్చాడు. పౌరులలో ధృతరాష్ట్రుణ్ణి చూడగోరిన వారందరూ బయలుదేరవచ్చుననీ, రేపే ప్రయాణమనీ చాటింపు వేయించాడు. ఈ చాటింపు విని స్త్రీలూ, వృద్ధులూ కూడా ప్రయాణమయారు. అందరూ చేరటానికి నగరం వెలపల అయిదు రోజులుండి, తరవాత అందరూ అరణ్యానికి బయలుదేరారు. వారి వెంట పెద్ద సేనకూడా కదిలింది. దానికి కృపాచార్యుడు నాయకత్వం వహించాడు. రథాల మీదా, ఏనుగుల మీదా, గుర్రాల మీదా, ఒంటెల మీదా, కాలినడకనా జనం ప్రయాణించారు. ద్రౌపది మొదలైన స్త్రీలు పల్లకీలలో ఎక్కి దారివెంట దాన ధర్మాలు చేస్తూ వెళ్ళారు. అందరూ బయలుదేరి పోతూ ఉంటే యుయుత్సుడూ, ధౌమ్యుడూ నగర రక్షణకు ఉండిపోయారు.

అందరూ కురుక్షేత్రం చేరారు. శతయూపుడూ, ధృతరాష్ట్రుడూ ఉంటున్న వనం అంత దూరాన ఉండగానే రథాలూ, వాహనాలూ దిగి, స్త్రీలతో సహా కాలినడకన ఆశ్రమానికి వచ్చారు. ఆశ్రమం అరటి తోటలతో ప్రశాంతంగా ఉన్నది. అక్కడ ఎవరూ లేరు. పాండవులు వచ్చినట్టు తెలిసి పరిసరాలలో ఉండే తాపసులు కొందరు వచ్చి, ధృతరాష్ట్రుడు యమునా నదికి స్నానం చెయ్యటానికి వెళ్ళినట్టు చెప్పారు.

అప్పుడు పాండవు లయిదుగురూ వారు చెప్పిన మార్గాన కొంత దూరం వెళ్ళేసరికి దూరంగా ధృతరాష్ట్రుడూ, గాంధారీ, కుంతీ కనిపించారు. సహదేవుడు అందరికన్నా ముందు పరిగెత్తి వెళ్ళి కుంతిని చేరి ఆమె కాళ్ళు పట్టుకుని బావురుమని ఏడ్చాడు. కుంతి కూడా కన్నీరు కార్చుతూ సహదేవుణ్ణి

లేవదీసి కౌగలించుకుని, గాంధారితో, "సహదేవుడు వచ్చాడు," అని చెప్పింది. తరవాత ఆమెకు మిగిలిన పాండవులు కూడా వస్తూ కనిపించారు.

కుంతి తాను ముందు నడిచి, గాంధారీ ధృతరాష్ట్రులను నడిపిస్తూ తన కొడుకులను సమీపించింది. పాండవులు ముసలివాళ్ళు తెస్తున్న జల పాత్రలను తాము తీసుకుని వారితోపాటు తిరిగి వచ్చారు. వారందరూ కలిసి పౌరులూ, స్త్రీలూ ఉన్న చోటికి వచ్చారు. ధర్మరాజు వారందరినీ నామ గోత్రాలతో సహా ధృతరాష్ట్రుడికి వివరించి చెప్పాడు. వారంతా తన చుట్టూ ఉంటే ధృతరాష్ట్రుడికి తాను మళ్ళీ హస్తినాపురం లోనే ఉన్నట్టు తోచింది.

స్త్రీలందరూ గాంధారికీ, కుంతికీ నమస్కారాలు చేశారు. తరవాత అందరూ ఆశ్రమం ప్రవేశించారు. చుట్టుపక్కల నుండి పాండవులను చూడవచ్చిన తాపసులు కోరిన మీదట సంజయుడు పంచపాండవులనూ, వారి భార్యలనూ, ఉత్తరనూ, ధృతరాష్ట్రుడి కోడళ్ళనూ వేరువేరుగా చూపాడు.

తరవాత కుశల ప్రశ్నలు జరిగాయి. ధృతరాష్ట్రుడు ధర్మరాజు రాజ్యపాలనను గురించి అడిగాడు. వాటికి తగిన విధంగా



సమాధానాలిచ్చి ధర్మరాజు ధృతరాష్ట్రుడి వనవాసం గురించి అడిగాడు. ఆ తరవాత ఆయన, "విదురు డెక్కడా కనిపించలేదే? ఏమైనాడు?" అని అడిగాడు.

"నాయనా, విదురుడు మహా ఘోరమైన తపస్సు చేసి కృశించి ఎక్కడెక్కడో తిరుగుతున్నాడు. ఈ అరణ్యంలో అప్పుడప్పుడూ కనిపిస్తాడని బ్రాహ్మణులు చెప్పారు," అని ధృతరాష్ట్రుడు జవాబు చెప్పాడు. ఆయన ఆ మాట అంటూండగానే వారికి చాలా దూరాన విదురుడు కానవచ్చాడు. ఆయన శరీరం బాగా దుమ్ముకొట్టుకుని ఉన్నది.

వెంటనే ధర్మరాజు బయలుదేరి విదురుడి కేసి వెళ్ళాడు. విదురుడు దట్టమైన అడవిలో ప్రవేశించి మధ్యమధ్య కనిపిస్తూ అంతలోనే కనిపించకుండా పోసాగాడు. "విదురా, నేను ధర్మరాజును. నీ దర్శనం కోసమే వస్తున్నాను," అని కేకలు పెడుతూ ధర్మరాజు ముందుకు పరిగెత్తాడు.

చిట్ట చివరకు విదురుడు ఒక నిర్జన ప్రదేశంలో నిలబడి ఉండి ధర్మరాజుకు కనిపించాడు. ఆయనను విదురుడని పోల్చటం కూడా కష్టంగా ఉన్నది. ధర్మరాజు, "మహాత్మా, నేను ధర్మరాజును," అంటూ విదురుడికి ఎదురుగా నిలబడ్డాడు. అప్పుడొక అపూర్వమైన విషయం జరిగింది. విదురుడు రెప్ప వెయ్యకుండా ధర్మరాజు కేసి చూడసాగాడు. అతని చూపులు ధర్మరాజు చూపులతో కలిశాయి. తరవాత విదురుడి ప్రాణాలు తన ప్రాణాలలోనూ, విదురుడి శరీరం తన శరీరంలోనూ ప్రవేశించినట్టు ధర్మరాజుకు తోచింది.

తరవాత కొంచెం సేపటికి ధర్మరాజు చుట్టూ చూడగా విదురుడి శరీరం మూసిన కళ్ళతో ఒక చెట్టు నాని పడి ఉండటం కనిపించింది. అది కళేబరం మాత్రమే. విదురుడు తనలో కలుస్తాడని వ్యాసుడు ఒకప్పుడు చెప్పిన మాటలు ధర్మరాజుకు జ్ఞాపకం వచ్చాయి. ఆయన విదురుడి కళేబరానికి దహన సంస్కారాలు చేసే యత్నంలో ఉండగా అశరీరవాణి, "ధర్మరాజా, యతుల కళేబరాలకు దహన సంస్కారం చెయ్యరాదు. దేహం చాలించిన యతి కొరకు దుఃఖించరాదు," అని చెప్పింది. వెంటనే ధర్మరాజు ఆ కళేబరాన్ని అక్కడే వదిలేసి, ఆశ్రమానికి తిరిగి వచ్చి ధృతరాష్ట్రుడికి జరిగిన దంతా చెప్పాడు. ధృతరాష్ట్రుడు చాలా సంతోషించాడు. అతిథులు ఆ పగలూ, ఆ రాత్రీ ధృతరాష్ట్రుడిచ్చిన కందమూలఫలాల ఆతిథ్యం స్వీకరించి చెట్ల కింద పడుకుని సుఖంగా నిద్రపోయారు.






## 29

[ కేశవుడూ అతడి అనుచరులను పట్టుకునేందుకు, బ్రహ్మదండి మాంత్రికుడు చేసిన తంత్రం పారింది. బ్రహ్మదండీ, పులుగురాయుడూ తమ అనుచరులతో, కేశవుణ్ణీ అతడి స్నేహితు లిద్దర్నీ చుట్టు ముట్టారు. బ్రహ్మదండి కేశవుణ్ణి ప్రాణాలతో పట్టుకుని, తతిమ్మా యిద్దర్నీ నిలువునా నరికి వేయమని కేకపెట్టాడు. తరవాత—]

బ్రహ్మదండి మాంత్రికుడి కేక వింటూనే కేశవుడు, ఆ ధ్వని వచ్చిన వైపుకు తల తిప్పాడు. తనకు అడ్డంగా వున్న రెక్కల మనుషులను పక్కకు తొలగ తోస్తూ, మాంత్రికుడు ముందుకు వచ్చాడు. అతడికి యిరు వైపులా జిత, శక్తివర్మలు కత్తులు దూసి నిలబడి వున్నారు. బ్రహ్మదండిని చూస్తూనే కేశవుడు కళ్ళెర్ర చేసి ముందుకు ఉరక బోయాడు. అంతలో నలుగు రైదు గురు రెక్కల మనుషులు అతడి మీద పడి ఆయుధాలన్నీ లాగి వేశారు. ఆ తరవాత జయమల్లూ, కోయగోమాంగ్ కూడా నిరాయుధులుగా చేయబడ్డారు.

నిస్సహాయంగా నిలబడి వున్న ఆ ముగ్గురికేసీ చూసి, జిత, శక్తివర్మలు వికటంగా ఒక పెద్ద నవ్వు నవ్వి, కత్తులు పై కెత్తుతూ, "అహాఁ, కత్తుల్ని యింతకు ముందే బాగా సాన పట్టి వుంచటం మంచిదయింది. ఒక్క వేటుతో రెండు తుండేలు చేయగలం!" అంటూ ముందుకు రాబోయారు. కాని,



అంతలో స్థూలకాయుడు తన కొరడాను పైకెత్తి పెద్దగా రంకె పెట్టి, వాళ్ళ కత్తుల్ని కొరడాతో చుట్ట బెడుతూ, "ఏయ్ఁ, జితా, శక్తీ! ఆగండి. వాళ్ళను చంపేందుకు వీలులేదు. వాళ్ళు ఒకప్పుడు నా బానిసలు. అరవై బంగారు కాసుల విలువ చేస్తారు. ఆ డబ్బు ముందు నా కిచ్చి తరవాత మీ యిష్టం వచ్చినట్టు చంపుకోండి," అన్నాడు.

స్థూలకాయుడి మాటలకు జితవర్మ తోక తొక్కిన తాచులా లేచి, "ఓయ్ఁ మాంసం పోగూ! ముందు నువ్వు ఆ కొరడాను నా కత్తికి అడ్డం తియ్యి. వాళ్ళిప్పుడు నీ బానిసలు కారు. వాళ్ళ నెప్పుడో అమ్ముకున్నావ్. ఆ కొన్న వర్తకులు చచ్చారు కూడా!" అన్నాడు.

"ఆ వర్తకులు చచ్చారు గనకే, నా వస్తువులు తిరిగి నా పరం అయినై. నీకీ పాటి వ్యవహార జ్ఞానం కూడా లేదా? అయ్యో, అనాగరిక మానవుడా!" అన్నాడు స్థూలకాయుడు.

జిత, శక్తివర్మలు రెచ్చిపోయి, కత్తులు జార విడిచి స్థూలకాయుడి మీద కలియబడ్డారు. స్థూలకాయుడు వాళ్ళను పిల్లి ఎలుకను పట్టినంత ఒడుపుగా పట్టుకుని నేల కేసి కొట్టాడు.

అంతవరకూ వినోదం చూస్తున్న వాడిలా నిలబడిన బ్రహ్మదండి మాంత్రికుడు, తన మంత్ర దండాన్ని పైకెత్తి ఒకసారి ఛీ అంటూ చీదరించుకుని, పులుగురాయుడి కేసి తల తిప్పి, "పులుగేశా! యిక మనం చూస్తూ వూరుకుని లాభం లేదు. ఈ మతి లేని వెధవలు ముగ్గురూ కుక్కల్లా కాట్లాడుకుని, ఆ కేశవుణ్ణి కూడా చంపటమో, లేక వాడు తన అనుచరులతో పారిపోయేందుకు అవకాశం కలిగించటమో చేస్తారు. ముందు ఆ కాట్ల కుక్కల్ని విడదీయండి," అన్నాడు.

పులుగురాయుడు తన చేతిలో వున్న ఈటెను పోట్లాడుకుంటున్న వాళ్ళ కేసి

గురి పెట్టి, "జితా, శక్తీ! మీరిక ఆ ఎను బోతుగాణ్ణి వదలండి. ఈ దొరికిన ముగ్గురూ నా వాళ్ళు. వాళ్ళను పట్టుకున్నది, నేను. తెలిసిందా?" అన్నాడు రౌద్రంగా.

పులుగురాయుడి హెచ్చరిక వింటూనే జిత, శక్తివర్మలు స్థూలకాయుడి పట్టు విడిపించుకుని, కింద పడి వున్న తమ కత్తుల్ని తీసుకుని, దూరంగాపోయి, పళ్ళు కొరుకుతూ నిలబడ్డారు.

స్థూలకాయుడు రొప్పుతూ తన కొరడా భుజాన వేసుకుని బ్రహ్మదండి మాంత్రికుడి కేసి గుడ్లురుముతూ చూశాడు.

బ్రహ్మదండి కేశవుణ్ణి సమీపించి అతడి భుజం పట్టుకుని కుదుపుతూ, "వత్సా, కేశవా! నీ మేలుకోరే నన్ను, నా శిష్య ద్రోహి జయమల్లు చెప్పుడు మాటలు విని ఎంత అపార్థం చేసుకున్నావో, ఆలోచిస్తూంటే నా ఆత్మ గిలగిల కొట్టుకుంటున్నది. నిన్ను కోటీశ్వరుణ్ణి చేయటమేగాక, లోకానికే అధిపతిని చేద్దామనుకున్నాను. ఇది, నా కోర్కె మాత్రమే కాదు; ఆ ఉపాసకుల ఊడల మర్రి కాలభైరవుడి అజ్ఞ! ఆ శత్రులు పాలిటి బ్రహ్మజెముడే నిన్ను తిరిగి నా పరం చేశాడు. మన యిద్దరం ఏక మవటం అంటే అగ్నికి వాయువు తోడైనట్టే. మన దెబ్బకు




తిరుగు వుండదు. ఏమంటావ్?" అని ప్రశ్నించాడు.

బ్రహ్మదండి మాటలు వింటూంటే కేశవుడికి ఒళ్ళు మండి పోయింది. అతడు మాంత్రికుడి చేతిని తన భుజం మీది నుంచి విసురుగా లాగి వేసి, "బ్రహ్మదండీ, నీ కల్లబొల్లి మాటలు నేను నమ్ముతా ననుకోకు. నీ వేపాటి మంత్ర శక్తి గల వాడవో నాకు తెలుసు!" అన్నాడు ఉద్రేకంగా.

బ్రహ్మదండి లోపల పొంగే కోపాన్ని అణుచుకుంటూ, "కేశవా, యీ ఒక్క సారికి నీ యీసడింపు మాటలను సహించాను. మరోసారి నా మంత్ర శక్తిని కించ



పరుస్తూ మాట్లాడావే, నిన్ను నిలువునా బూడిద చేసి, అది శరీరానికి రాసుకుని ఆ కనబడే మొసళ్ళ మడుగులో స్నానం చేసి, నా కాలభైరవుడి దగ్గిరకు వెళ్ళి పోతాను. ఈ జయమల్లు శుంఠకు ఒక్క చారల గాడిద వేషం వేసే మంత్రం తప్ప మరేం తెలుసు?" అంటూ జయమల్లు కేసి తిరిగి, "ఈ ద్రోహినీ, ఆ కోయ వెధవనూ ఈటెలతో శరీరాలు తూట్లు తూట్లుగా పొడిచి, గద్దలకు ఆహారంగా వెయ్యండి," అన్నాడు పళ్ళు పటపట కొరుకుతూ.

బ్రహ్మదండి మాంత్రికుడు మాట ముగించే లోపలే జిత, శక్తివర్మలు కత్తులెత్తి జయమల్లునూ, కోయగోమాంగ్‌నూ పొడవ బోయేంతలో, పులుగురాయుడు తన ఈటెతో వాళ్ళ కత్తులను కింద పడేలాకొట్టి, "ఆగండి, ఆగండి! 'గద్దలకు ఆహారం' అన్న మాట వింటూనే నాకో ఆలోచన వచ్చింది. వీళ్ళిద్దరి రూపు రేఖలూ చూస్తూంటే వీళ్ళు గద్ద జాతి మానవుల్లా కనిపిస్తున్నారు. మా గరుడ జాతి వాళ్ళకు, గద్ద జాతి వాళ్ళు సర్వ కాలాల్లో సేవకా వృత్తి చేసి బతకాలని శాస్త్రం వున్నట్టు విన్నాను. కనక, వీళ్ళిద్దరూ నా సేవకులు," అంటూ తన అనుచరుల కేసి తిరిగి, "ఒరేయ్, వీళ్ళను నా గృహానికి తీసుకు పోయి జాగర్తగా కాపాడండి. నా ఈదుపులూ అవీ చెదలు పట్టకుండా దులిపి ఎండ వేసే పని నేర్పండి. వాళ్ళు పారిపోయారో, మీ ప్రాణాలు తీస్తాను," అన్నాడు.

పులుగురాయుడి అనుచరులు జయమల్లునూ, కోయగోమాంగ్‌నూ భుజాలు పట్టుకుని యీడ్చుకు పోబోయేంతలో, బ్రహ్మదండి వాళ్ళకు అడ్డు పడి, పులుగురాయుడితో, "పులుగు ప్రభో! మీరు అతిగా తొందర పడకండి. వీళ్ళ సంగతి మీకు ఆవగింజంత కూడా తెలీదు. వీళ్ళు పారిపోతారనే భయం మీ కొద్దు. వాళ్ళు పారి

పొదలిస్తే, మీ ప్రాణాలు తీసిం తరవాతే పారిపోతారు. నా మాట విని, వీళ్ళ నిక్కడే ముక్కలు ముక్కలుగా నరికించి కాకులకు మేతగా వేయండి," అన్నాడు.

బ్రహ్మదండి యిలా అనగానే పులుగు రాయుడు చీదరించుకుంటున్న వాడిలా ముఖం పెట్టి, "ఏం, బ్రహ్మదండీ! ప్రతి స్వల్పానికీ నువ్వు కనబరచే భయం, చేసే గోలా చూస్తూంటే, నువ్వు కాకి జాతి మానవుడిలా కనిపిస్తున్నావు. గద్ద జాతి మానవులకు, కాకి జాతి మానవులు అన్ని వేళలా ఊడిగం చేస్తూ జీవించాలని శాస్త్ర పుస్తకాల్లో వుంది. ఆ సంగతి నీకూ తెలుసు! కనక నిన్ను ఈ యిద్దరికీ సేవకుడిగా నియమిస్తున్నాను," అన్నాడు.

పులుగురాయుడి మాటలతో బ్రహ్మదండి శివమెత్తిన వాడిలా అయిపోయి, గంతులు వేస్తూ, మంత్ర దండాన్ని గిర్రున తిప్పుతూ, "పులుగు దొరా, ఈ కాలభైరవే పాసకుణ్ణి ఎంత మాటన్నారు! సరే, నేను నా కేశవుణ్ణి వెంట బెట్టుకుని రాకాసిలోయకు వెళ్ళి పోతాను. మీకు వాగ్దానం చేసిన విధంగా, మీ దేవతకు బలి మనుషుల్ని తప్పక పంపుతాను. రేపు సూర్యోదయంతోనే, నా ప్రయాణం," అన్నాడు.



"అందుకు నా అభ్యంతరం ఏమీ లేదు. యిక కదలండి," అంటూ పులుగురాయుడు బయలుదేరాడు. అతడి వెంట అందరూ కదిలారు. కేశవుణ్ణీ, జయమల్లునూ, కోయ గోమాంగ్‌నూ పది మంది రెక్కల మనుషులు ముందూ వెనకా కాపుండి నడిపించారు. బ్రహ్మదండి, స్థూలకాయుడికి సొంజ్ఞ చేసి గుంపు నుంచి పక్కకు తీసుకుపోయి రహస్యంగా, "వీర చూడామణీ! నే చెప్పేది శ్రద్ధగా విను. యిక మనం ఈ పక్షి ముఖం వెధవ దగ్గిర వుండటం ప్రమాదకరం. రేపు తెల్లవారుతూనే, నేనూ, జిత, శక్తివర్మలూ, నువ్వూ కలిసి, ఆ కేశవుణ్ణి తీసుకుని రాకాసి



లోయకు వెళ్ళి పోదాం. ఆ కేశవుడు పారిపోకుండా జాగ్రత్త పడ్డామంటే, రాకాసి లోయలోని ధనరాసులన్నీ మనవే. వాడు వెంట లేకుండా అక్కడ మనం ఒక గుడ్డి గవ్వకు కొరగాం. అదీ సంగతి," అన్నాడు.

"ఆ వెధవ కుర్రకుంకను గురించి నువ్వంతగా వాపోవటం ఏం బాగా లేదు. నా లెక్కన వాడు ఇరవై బంగారు కాసుల కన్న ఎక్కువ విలువ చెయ్యడు," అన్నాడు స్థూలకాయుడు పెదాలు చప్పరిస్తూ.

"అన్నన్నా, ఎంత మాట! ఆ కేశవుడు సామాన్యుడనుకున్నావా? వాడు రాజయోగాన్ని భుజాన వేసుకుని పుట్టాడు. వాడి మూపు మీద పడగ విప్పిన పాము ఆకారం గల మచ్చ చూస్తే, నువ్విలా మాట్టాడవు. దాన్ని స్వయంగా ఆ కాలభైరవుడే అచ్చు గుద్దాడు, తెలిసిందా?" అంటూ బ్రహ్మదండి మాంత్రికుడు చెంపలు వేసుకున్నాడు.

"వాడు బ్రహ్మపురానికి రాజైన నాడు గాని, నువ్వు చెప్పేది నేను నమ్మను. ఏదెలా అయితే నాకేం? నాకు చేసిన వాగ్దానం మాట మరవకు," అన్నాడు స్థూలకాయుడు.

బ్రహ్మదండీ, స్థూలకాయుడూ రహస్యంగా మాట్టాడుకోవటాన్నేగాక, అంతకు ముందు జరిగిన సంఘటనలన్నీ కూడా బిడాలి, శ్వానకర్ణి నియమించిన వేగుల వాళ్ళు, కొండ రాళ్ళ చాటు నుంచి గమనించారు. వాళ్ళు కేశవుడూ, అతడి అనుచరులు పులుగురాయుడికి పట్టు బడటం దగ్గిర నుంచి సర్వం ఎప్పటి కప్పుడు తమ నాయకులకు తెలియపరుస్తూనే వున్నారు.

కేశవుడూ వాళ్ళు గుహలో ప్రవేశించిన తరవాత నిప్పులు కక్కే సింహం పారిపోవటాన్ని గురించి విన్న బిడాలీ, శ్వానకర్ణీ యిక తమకు వచ్చిన ప్రమాదం ఏమీ లేదని నిశ్చయించుకుని, గుహలో ప్రవేశించి, కొంత సేపటికి కోయగోమాంగ్ వదిలిపోయిన రాతి





గదను చూశారు. ఆ తరవాత వాళ్ళు కాలి గుర్తులను అనుసరిస్తూ నడిచి, సారంగం పైన వున్న కంత నుంచి బయట జరుగు తున్నదంతా గమనించారు.

"ఇంత మంది దుర్మార్గుల్ని వాళ్ళ స్వస్థలంలో ఎదిరించి గెలవటం కష్టం. పైగా, ఈ లోపల వాళ్ళు కేశవుణ్ణీ అతడి స్నేహితు లనూ చంప వచ్చు," అన్నాడు బిడాలి.

శ్వానకర్ణి తన మూల పురుషుడి రాతి గదను కళ్ళ కొసారి అద్దుకుని, "ఇక, నా ముఠాకు అపజయ భయం లేదు. మన మిత్రులైన ఆ ముగ్గుర్నీ రక్షించే భారం నాది. తరవాత, వాళ్ళ సాయం కూడా తీసుకుని, మొత్తం ఈ రెక్కల పక్షిగాళ్ళను దుంపనాశం చేస్తాను," అన్నాడు.

"వాళ్ళను రక్షించే భారం నా మీద కూడా కొంత వున్నది. రెక్కల మనుషుల దేవతకు బలికా నున్న నా ముఠావాళ్ళను ఆ ముగ్గురూ రక్షించారు. ఇంతకూ నీ ఆలోచన ఏమిటి?" అని అడిగాడు బిడాలి.

బిడాలి అలా ప్రశ్నించగానే శ్వానకర్ణి తల పంకిస్తూ కాసేపు వూరుకుని, తరవాత అంత దూరంలో వున్న తన ముఠా వాళ్ళలో యిద్దర్ని దగ్గిరకు పిలిచి, "మీరు చీకటి పడుతూనే, ఈ కంత నుంచి బయిటికి పోయి అక్కడ పడి వున్న పక్షి రెక్కలు తగిలించుకుని, రెక్కల మనుషుల్లా నటిస్తూ, పులుగురాయుడు నివసించే ప్రాంతాలకు వెళ్ళి, కేశవుడూ వాళ్ళ స్థితి ఎలా వున్నదో తెలుసుకు రావాలి," అని ఆజ్ఞాపించాడు.

"ఇదా నీ ఎత్తుగడ? బాగానే వుంది. నీ ముఠా వాణ్ణొకణ్ణీ, నా ముఠా వాణ్ణొకణ్ణీ పంపుదాం. అది న్యాయంగా వుంటుంది," అన్నాడు బిడాలి. ఇందుకు శ్వానకర్ణి అంగీకరించాడు.

తరవాత కొంత సేపటికి సూర్యాస్త మానమై క్రమంగా చీకటి పడింది. శ్వానకర్ణి బిడాలి ముఠాల అడవిమనుషు లిద్దరూ

సొరంగాన్నుంచి బయిటికి పాకిపోయి, అక్కడ మధ్యాహ్నం జరిగిన తన్ను లాటలో రెక్కల మనుషులు వదిలిపోయిన పక్షి రెక్కల్లో తమకు కావలసినవి ఏరుకుని, చేతులకు తగిలించుకుని పులుగురాయుడు నివసించే ప్రాంతాలకు వెళ్ళారు.

దారిలో ఆ యిద్దర్నీ ఎవరూ అను మానించి అటకాయించ లేదు. వాళ్ళు ఒక్కొక్క గుడారాన్నే దాటిపోతూ, చివరకు బ్రహ్మదండీ, స్థూలకాయుడూ వున్న గుడారం ముందు నుంచి వెళ్ళేటప్పుడు, కాగడాల వెలుగులో వాళ్ళిద్దర్నీ గుర్తించి, ఆ పక్కనే కేశవుడూ అతడి అనుచరు లుండవచ్చని ఊహించారు. తరవాత నాలు గడుగులు ముందుకు వెళ్ళేసరికి వాళ్ళు ఊహించినది నిజమని తేలిపోయింది. ఒక గుడారం ముందు జిత, శక్తివర్మలు కత్తులు పట్టుకుని కాపలా కాస్తున్నారు. లోపల కేశవుడూ, జయమల్లూ, కోయగోమాంగ్ చాపల మీద కూచుని మాట్లాడు కుంటున్నారు.

అడవిమనుషు లిద్దరూ జంటగా జిత, శక్తివర్మలను సమీపించి, "దారి తొలగండి! లోపల వున్న ఆ ముగ్గురు దుర్మార్గుల్నీ తన వద్దకు తీసుకు రమ్మని పులుగుదొర ఆజ్ఞ అయింది," అన్నారు.

జిత, శక్తివర్మలు పక్కన వెలుగుతున్న కాగడాలతో అడవిమనుషుల ముఖాలను పరీక్షగా చూసి, దారి యిచ్చారు. కాని, అంతలో జితవర్మ కేదో అనుమానం తగిలి, "వీళ్ళు రెక్కల మనుషుల జాతి వాళ్ళలా లేరు, అడవి మనుషుల ముఖ లక్షణాలు కనబడుతున్నవి," అన్నాడు.

"అవునవును, నాకూ అదే అనుమానం కలిగింది, సుమా!" అంటూ శక్తివర్మ కత్తి దూసి, "ఏయ్, మీరెవరు? ఆగండి!" అంటూ ముందుకు వెళ్ళాడు.

—(ఇంకా వుంది)






## 2

చంటిబిడ్డకు బద్‌బసీమ్ అని నామకరణం జరిగినాక, అతడి మేనమామా, గుల్నార్‌కు అన్నా అయిన సాలిహ్, వాణ్ణి చేతులలోకి తీసుకుని ముద్దు లాడుతూ, మధ్య మధ్య పైకి ఎత్తుతూ, గదిలో అటూ ఇటూ పచార్లు చేశాడు. అతను ఉన్నట్టుండి ఒక్క ఎగురున గవాక్షంలోకి ఎక్కి, చంటివాడితో సహా సముద్రంలోకి దూకి మాయమైపోయాడు.

రాజు షారిమాన్ పొలి కేకలు పెట్టి, నెత్తి, బాదుకుని, ప్రాణం కడబట్టినంత పని చేశాడు. గుల్నార్ ఆయనను అనునయిస్తూ, తాపీగా, "బిడ్డ కోసం ఏమాత్రమూ బెంగ పడకండి. కడుపున మోసి కన్నదాన్ని నాకు లేని భయం మీకు దేనికి? మా అన్న వాడికే అపాయమూ రానివ్వడు. బిడ్డ తడవనైనా తడవడు, చూస్తూ ఉండండి. వాడిలో మీ రక్తం సగం ఉన్నప్పటికీ, నా నుంచి వాడికి నీటిలో జీవించే గుణం అబ్బింది. మా అన్న ఇప్పుడే తిరిగి వచ్చేస్తాడు లెండి," అన్నది. మిగిలిన సముద్ర స్త్రీలు కూడా అదే చెప్పారు. అయినప్పటికీ, సాలిహ్ బిడ్డతో తిరిగి వచ్చినదాకా రాజు మనస్సు కుదట పడలేదు. సాలిహ్ సముద్రంలో నుంచి ఒక్క గెంతున గవాక్షం మీదికి వచ్చి గది లోకి దిగాడు. అతని చేతిలో ఉన్న బిడ్డ చెక్కు చెదరక శాంతంగా ఉండటమేగాక, నవ్వుతున్నాడు కూడా.

"నేను సముద్రంలోకి దూకి నప్పుడు మీరు కంగారు పడ్డారనుకుంటాను?" అని అతను రాజు నడిగాడు.

"కంగారా? బిడ్డ మళ్ళీ కళ్ళ బడతా డనుకోలేదు," అన్నాడు రాజు.

సి. మాధవరావు

"ఇక వీడికి నీటి భయం లేదు. నేను వీడికి చేయవలసిన మంత్రతంత్రాలన్నీ చేశాను. ఈ జీవిత మంతా వీడు నేల మీద నివసించి నంత తేలికగా నీటిలో కూడా నివసించ గలడు. సముద్ర మానవులకుండే హక్కులన్నీ వాడికి కూడా ఉన్నాయి," అని సాలిహ్ అన్నాడు.

అతను బిడ్డను తల్లికి తిరిగి ఇచ్చి, ఒక సంచీ తీసి అందులో ఉన్నదంతా తివాసీపై కుమ్మరించాడు. వాటిలో పావురాయి గుడ్లంత వజ్రాలూ, ఆరంగుళాల నిడివిగల పచ్చల పలకలూ, పెద్ద ముత్యాల చేర్లూ, వింత అయిన ఎరుపు రంగు గల కెంపులూ, ఇంకా అనేక రకాల సముద్ర రత్నాలూ ఉన్నాయి. వాటి కాంతులు గది అంతా వెలిగించాయి.

"వట్టి చేతులతో బయలుదేరటం ఇష్టం లేక దొరికినవి తెచ్చాను. ఈసారి వచ్చేటప్పుడు మేలైన రత్నాలు ఎంచి తెస్తాను," అన్నాడు సాలిహ్ రాజుతో.

తన బావమరిదికి తన కృతజ్ఞత ఎలా తెలపాలో తెలియక, రాజు తన భార్య కేసి తిరిగి, "మీ అన్న చేసిన బహుమానాలతో నా మతి చెడింది. ఇందులో ఒక్కొక్కటీ నా రాజ్యం విలువ చేస్తుంది," అన్నాడు. గుల్నార్ తన అన్నకు కృతజ్ఞత తెలిపి, తన



భర్తతో, "ఇవి నిజంగా మీ యోగ్యతకు తగవు. మీరు మాకు చేసిన మేలు జన్మలో తీరేదికాదు," అన్నది.

రాజు తన బావమరిదిని కౌగలించుకుని, అతనూ, అతని వెంట వచ్చిన స్త్రీలూ నలభై రోజులపాటు తన ఇంట ఉండి విందు లారగించాలని కోరాడు.

నలభై రోజులూ గడిచినాక సాలిహ్ రాజును తమ ప్రయాణానికి అనుమతి కోరాడు. తమకు ఇంటి మీద బుద్ధి మళ్ళిందనీ, జలవాసులు దీర్ఘకాలం భూమి మీద ఉండటం ఆరోగ్యానికి అంత మంచిది కాదనీ అతనన్నాడు. అప్పుడప్పుడూ తాము వచ్చి తన చెల్లెలినీ, మేనల్లుణ్ణీ చూసి పోతూ ఉండగలమని కూడా అతను రాజుకు చెప్పాడు.

"నాకు కూడా మీ రాజ్యానికి రావాలనే ఉన్నదిగాని, అది సాధ్యం కాదు. నాకు మొదటి నుంచీ నీరంటే తగని భయం కూడానూ," అన్నాడు రాజు.

తరవాత గుల్నారు బంధువులు సముద్రంలోకి దూకి, వచ్చినట్టుగానే వెళ్ళిపోయారు...

బద్రబసీమ్‌కు నాలుగేళ్ళు నిండేదాకా గుల్నార్ తానే పాలిచ్చింది. అందుచేత అతనికి ఆ పాలతోబాటు సముద్ర మానవుల గుణాలు బాగా వంట బట్టాయి. తల్లి పాలు





అతనికి ఘంచి ఆరోగ్యమూ, అందమూ కూడా చేకూర్చాయి. పదిహేనేళ్ళ కల్లా అతను మంచి దృఢకాయుడూ, మేధావీ, విద్యాధికుడూ, వివేకీ అయాడు.

రాజు ముసలివాడైపోయాడు. తాను జీవించి ఉండగానే తన కొడుకును రాజు చేయాలని ఆయన సంకల్పించాడు. ఆయనకు తన కొడుకుపై అపారమైన ప్రేమ ఉండటం అలా ఉంచి, వాడిలో ఆయనకు రాజ లక్షణాలనేకం కనిపించాయి. అందు చేత, ఒకనాడాయన బద్రబసీమ్‌ను రాజ సభకు తీసుకుపోయి, రాజుగా ప్రకటించి, సింహాసనం మీది నుంచి తాను దిగి, తన కిరీటం అతని నెత్తిన పెట్టి, అతన్ని సింహాసనం మీద కూచోబెట్టి, అతని కుడి పక్కన తాను సామాన్యుడిలా నిలబడ్డాడు.

వెంటనే బద్రబసీమ్ ఆనాటి సభను తానే స్వయంగా నిర్వహించి, రాచకార్యాలన్నీ దక్షతతో నిర్వర్తించి, తన తండ్రికీ, మంత్రులకూ ఆశ్చర్యం కలిగించాడు. ఆ మధ్యాన్నం అతను తండ్రితోబాటు ఇంటికి వెళ్ళి తన తల్లికి కనిపించాడు. ఆమె అతని తలపై కిరీటం చూసి ఆనందాశ్రువులు రాల్చి, దీవించింది.

ఒక ఏడాదిపాటు ముగ్గురూ ఆనందంగా జీవించారు. ఆ తరవాత రాజుకు అవసాన కాలం వచ్చేసింది. ఆయన ఒక్కసారి తన భార్యనూ, కుమారుణ్ణీ ఆలింగనం చేసుకుని ప్రాణాలు వదిలాడు.

తల్లి కొడుకులు రాజు కోసం నెల రోజులు మైల పట్టి ఎవరినీ చూడలేదు. తరవాత వారు రాజుకు గొప్ప సమాధి కట్టించి, దాని పేర పెద్ద నిధి ఏర్పాటు చేసి, పేదలకూ, వితంతువులకూ, అనాథలకూ దానధర్మాలు జరిగేటట్టు చేశారు.

సముద్రలోకం నుంచి గుల్నార్ బంధువులు వచ్చారు. ఆ మధ్యకాలంలో వారు చాలాసార్లు వచ్చి వెళ్ళారుగాని, రాజుగారి

ఆఖరు ఘడియలలో తాము దగ్గిర లేనందుకు వారు చాలా విచారించారు. ఏడుపులతోనూ, ఓదార్పులాటలతోనూ కొన్ని వారాలు గడిచిన మీదట బద్రబసీమ్ తిరిగి రాజలాంఛనాలూ, కిరీటమూ ధరించి దర్బారు జరపసాగాడు. ఈ విధంగా మరొక సంవత్సర కాలం గడిచిపోయింది.

ఒకనాటి అపరాహ్నం తలవని తలంపుగా సాలిహ్ సముద్రంలో నుంచి తన చెల్లెలినీ, మేనల్లుణ్ణీ చూడ వచ్చాడు. బద్రబసీమ్ ఒక మంచం మీద పడుకున్నాడు: అన్నా చెల్లెళ్ళు ఏవేవో విషయాలు మాట్లాడుకున్నారు. మాటల సందర్భంలో సాలిహ్ తన మేనల్లుడి గుణ గణాలను గురించి ఘనంగా మాట్లాడసాగాడు. ఆ మాటలు తాను వింటున్నట్టు తెలియటం బాగుండదని బద్రబసీమ్ కళ్ళు మూసుకుని, నిద్ర పోతున్నట్టు పడుకున్నాడు.

తన మేనల్లుడు నిద్రపోతున్నాడనుకుని సాలిహ్ అతని పెళ్ళి ప్రస్తావన తెచ్చి, "నీ కొడుక్కు పెళ్ళి యీడు వచ్చింది. వాడికి తగిన సముద్ర రాజకుమార్తెను ఒకతెను చూసి సాధ్యమైనంత త్వరలో పెళ్ళి చేసెయ్యటం మంచిదనుకుంటాను," అన్నాడు.



"నాకైనా అంతకన్న కావలిసిందేముంది? నాకా ఒక్కడే కొడుకు. వాడికి సంతానం కలిగితే చూడాలని నాకూ కోరికగానే ఉంది. అయితే పెళ్ళి యీడు గల సముద్ర కన్య లెవరెవరున్నారో చెప్పు," అన్నది గుల్నార్.

సాలిహ్ అనేకమంది కన్యలను గురించి చెప్పాడు. గుల్నార్ వారి నెరగకపోయినా, వారి తలి దండ్రులను ఎరుగును. ఒకతె తండ్రి మంచివాడు కాడనీ, ఒకతె తల్లి చెడ్డదనీ, మరొకతెది మంచి వంశం కాదనీ, ఇంకొకతె చెడ్డ సంప్రదాయం నుంచి వచ్చినదనీ చెప్పి అందరినీ గుల్నార్ కొట్టిపారేసింది.

"నీ కొడుక్కు చేసుకోబోయే పిల్లను గురించి నీకు పట్టుదల లుండటం మెచ్చుకో దగిన సంగతే. ఇంకొక్క పిల్లను గురించి చెప్పాలి—కాని మనవాడు ఆ పిల్లను గురించి వినటం అంత క్షేమం కాదు; వాడు నిద్రపోతున్నాడో, లేదో ముందు చూడాలి," అన్నాడు సాలిహ్.

గుల్నార్ లేచి వెళ్ళి తన కొడుకును చూసి, అతను నింపాదిగా ఊపిరి తీస్తూండ టాన్నిబట్టి నిద్రపోతున్నాడనుకుని, తిరిగి వచ్చి, "చెప్పు," అన్నది.

"అమ్మాయీ, ఈ సంగతి రహస్యంగా ఎందుకు చెప్పవలిసి వచ్చిందంటే, ఒక రాజకుమార్తె ఉన్నది. దాన్ని మనవాడికి భార్యగా సంపాదించటం దాదాపు అసంభవం. దాని తండ్రి చచ్చినా ఒప్పుకోడు. సంబంధం ఖాయమైతే తప్ప నా మేనల్లుడు ఆ పిల్లను గురించి వినటం అంత మంచిది కాదు. ప్రేమ అనేది చెవుల ద్వారా అతి సులువుగా ప్రవేశిస్తుంది. ఆ ప్రేమ తల కెక్కినాక తీరిందా అమృతం, తిరస్కారం పొందిందా హాలాహలం," అన్నాడు సాలిహ్.

"ఇంతకూ ఆ పిల్ల ఎవరు? దాని తండ్రి ఎవరు?" అని గుల్నార్ అడిగింది.

"పిల్ల పేరు జహ్నరా. సమందల్ రాజు కూతురు. దానిని పోలిన అందగత్తె భూమి



మీద లేదు, సముద్రంలోనూ లేదు. దాని శరీరచ్ఛాయ, దాని జుట్టు, దాని కళ్ళు, దాని కుదిరిక నిజంగా వర్ణనాతీతం!" అన్నాడు సాలిహ్.

"పేరుకు తగ్గ పిల్లే నన్నమాట! దాన్ని నా కొడుక్కు చేసుకుంటాను," అన్నది గుల్నార్ సంతోషంగా.

"బాగానే ఉంది. కాని దాని తండ్రి మాటేమిటి? ఆ సమందల్ ఒట్టి పశువు, రాక్షసుడు. తన కూతుర్ని చేసుకుంటామని వచ్చిన ఎందరో రాజకుమారులను చావ గొట్టించి, అవమానించి పంపాడు. మనం వెళ్ళి అడిగితే ఏం చేస్తాడో, తలుచు కోవటానికే నాకు భయంగా ఉంది. అందుకే నేను యింతగా తటపటాయిస్తున్నాను," అన్నాడు సాలిహ్.

"అలా అయితే మనం తొందర పడ రాదు. జాగ్రత్తగా ఆలోచించి పథకం వెయ్యాలి," అన్నది గుల్నార్.

"నీవు కూడా ఆలోచిస్తూ ఉండు. కార్యం నెరవేరేందుకు ఏదో ఒక మార్గం దొరకక పోదు," అన్నాడు సాలిహ్.

ఈ సంభాషణ పూర్తిగా విన్న బద్ర్ బసీమ్, అప్పుడే నిద్ర మేలుకున్నట్టు కని పించటంతో వారా విషయం కట్టి పెట్టారు. కాని జరగవలిసిన మోసం జరిగేపోయింది.





బద్రబసీమ్ హృదయం జహ్నరా రాజ కుమార్తె కోసం ఆవేదన పొందసాగింది. అతను ఈ సంగతి తన తల్లికీ, మేన మామకూ తెలియనివ్వలేదుగాని, తెల్లవార్లూ మేలుకుని ఉండి తన కోరిక తీరేదెలాగా అని దీర్ఘంగా ఆలోచించాడు.

అతను తెల్లవారు ఝామునే లేచి, తన మేనమామను లేపి, "మామా సముద్రం ఒడ్డున షికారుకు పోదామనిపిస్తున్నది. నీవు కూడా వస్తావా ఏం?" అని అడిగాడు. సాలిహ్ సరే నన్నాడు. ఇద్దరూ సముద్ర తీరానికి వెళ్ళారు. ఇద్దరూ ఎంత సేపు ఇసకలో నడిచినా బద్రబసీమ్ తన మేన మామతో ఒక్క మాటకూడా మాట్లాడ లేదు. చివరకు అతనొక రాతి మీద కూచుని, నిట్టూర్పులు పుచ్చుతూ, సమందల్ రాజు కూతురైన జహ్నరా పైన ఒక ప్రేమ గీతం పాడాడు.

ఆ గీతం వింటూనే సాలిహ్, "అంతా అల్లా ఇచ్ఛ! అయితే నేను మీ అమ్మతో అన్న మాటలన్నీ విన్నావన్న మాట! ఆ సంబంధం గురించి ఇంకా మాటలైనా జరగక ముందే నీ వా పిల్లకు హృదయం అర్పించి కూచున్నావు. ఇందుకు నాకు చాలా విచారంగా ఉంది," అన్నాడు.

"ఆమె లేకుండా నేను బతకలేను," అన్నాడు బద్రబసీమ్.

"సరే అయితే ఇంటికి వెళ్ళి, మీ అమ్మతో చెప్పి, సమందల్ రాజు వద్దకు పోదాం పద," అన్నాడు సాలిహ్.

"మా అమ్మ నడగను. ఆమె ఎలాగూ అనుమతి ఇవ్వదు. సమందల్ పశు ప్రాయుడు గనక నన్నేమి చేసిపోతాడో అని భయపడుతుంది. నేను వెళితే రాచ కార్యాలు నిలిచి పోతాయనీ, శత్రువులు నా సింహాసనం కాజేస్తారనీ అడ్డంకులు చెబుతుంది. మా అమ్మ సంగతి నే నెరగనా?" అన్నాడు బద్రబసీమ్. అతను



వెంటనే సమందల్ రాజు వద్దకు బయలుదేరాలనీ, తాను వెళ్ళినట్టు తల్లికి తెలిసేలోగా తిరిగి రానే రావచ్చుననీ అన్నాడు.

చేసేదిలేక, సాలిహ్ అల్లా పై భారం ఉంచి, తన మేనల్లుడికి రక్షగా ఉండటానికి ఒక ఉంగరం ఇచ్చి, అతనితోబాటు తాను కూడా సముద్రంలోకి దూకాడు.

సాలిహ్ తన మేనల్లుణ్ణి ముందు తన ఇంటికి తీసుకుపోయాడు.

మనవణ్ణి చూసి అమ్మమ్మా, ఇతర స్త్రీలూ ఎంతో సంబరపడ్డారు.

"ఇవాళ ఎంత మంచిరోజురా, నాయనా! ఎంత పండగరా, మాకు! మీ అమ్మ కులాసాగా ఉన్నదా?" అని గుల్నార్ తల్లి మనవణ్ణి అడిగింది.

"ఆ, మిమ్మల్నందరినీ అడిగానని చెప్పమన్నది," అని బద్ర్‌బసీమ్ బొంకాడు.

మిగిలిన ఆడపిల్లలు బద్ర్‌బసీమ్‌ను తమ ఇల్లు చూపించటానికి తీసుకుపోయినప్పుడు, సాలిహ్ తల్లికి జరిగినదంతా దాచకుండా చెప్పాడు.

తల్లి అతన్ని బాగా చివాట్లు పెట్టింది. "సమందల్ ఎటువంటి ధూర్తుడో నీకు తెలుసు. వాడికి బుద్ధిశూన్యమూ, అహంకారం జాస్తీనూ. అలాటప్పుడు ఆ దుర్మార్గుడి కూతురును గురించి కుర్రవెధవ వినేలాగా మాట్లాడ వచ్చునా? దాని పేరైనా వాడి దగ్గిర ఉచ్చరించటం ప్రమాదం గదా!" అన్నదామె.

"నిజమే ననుకో. కాని అయిన దానికి చింతించి ఏం లాభం? సమందల్ అభ్యంతరం చెప్పటానికైనా ఏముంటుంది? బద్ర్ బసీమ్ అందంలో ఆ పిల్లకు తీసిపోడు. వాడి వంశమూ ఎంతో గొప్పది. వాడు స్వయంగా గొప్ప సామ్రాజ్యానికి అధిపతి. ఇలాటి సంబంధం దొరకటమే పదివేలని నేను సమందల్‌ను ఒప్పించగలను. పొరపాటు నా వల్ల జరిగింది గనక మధ్యవర్తిగా

నేనే వెళ్ళటం మంచిది. విరిగితే నా ఎముకలే విరుగుతాయి," అన్నాడు సాలిహ్.

అతను రెండు సంచుల నిండా కానుకలు నింపుకుని, బానిసల చేత వాటిని మోయించుకుంటూ సముద్రమార్గాన సమందల్ రాజభవనానికి బయలుదేరి వెళ్ళాడు.

రాజభవనం చేరుతూనే సాలిహ్ రాజదర్శనం అర్థిస్తూ లోపలికి కబురు పంపాడు. రావచ్చునని లోపలి నుంచి అనుమతి వచ్చింది. లోపల హాలులో, రత్నాసనంపై కూచుని ఉన్న సమందల్ రాజుకు సాలిహ్ అత్యంత గౌరవంతో అభివాదనం చేసి, తాను తెచ్చిన రెండు సంచులూ ఆయన పాదాల వద్ద ఉంచాడు.

"కూచో, సాలిహ్. నీవు కనిపించి చాలా కాలమయింది. నీవు వచ్చిన పని ఏదో వెంటనే చెప్పెయ్యి. కానుకలు తెచ్చేవారు వాటికి తగిన ప్రతిఫలం అపేక్షిస్తారు. చెప్పు, చెయ్యటం నాకు సాధ్యమవుతుందేమో చూస్తాను," అన్నాడు సమందల్.

సాలిహ్ వంగి సలాము చేసి, "నే నొక పని మీద వచ్చిన మాట నిజమే. అది అల్లా కరుణ వల్లా, తమ కటాక్షం వల్లా కావాలి. తమ ఈవీ, శౌర్యపరాక్రమాలూ, సౌజన్యమూ, కీర్తీ, మర్యాదా, ఘనతా సాటి



లేనివి. వాటిని గురించి సముద్రంలో ఉండేవారూ, భూమి మీద ఉండే వారూ కూడా చెప్పుకుంటారు. సార్థవాహులు సాయంకాలపు తీరిక సమయాలను తమ కథలతోటే గడిపేస్తారు," అన్నాడు.

"నీకు కావలసిందేమిటో అడుగు, సాలిహ్. సానుభూతితో వింటాను. సాధ్యమైతే తప్పకుండా తీరుస్తాము, కాకపోతే మర్యాదగా కాదని చెప్పేస్తాను," అన్నాడు సమందల్ రాజు.

సాలిహ్ ఈసారి మరింత వంగి సలాము చేసి, "నా కోరిక తీర్చడానికి సామర్థ్యం తమ ఒక్కరికే ఉన్నది. మీ కుమార్తె

జహ్నరాను నా మేనల్లుడైన బద్రబసీమ్ కిచ్చి చెయ్యండి. అతను పారిమాన్ కుమారుడు. పర్షియా సరిహద్దు నుంచి ఖురాసాన్ కొన దాకా వ్యాపించి ఉన్న సామ్రాజ్యానికతను రాజు," అన్నాడు.

ఈ మాటలు వింటూనే సమందల్ పొట్ట చెక్కలయేటట్టు విరగబడి నవ్వాడు. ఆ నవ్వు తెర అయిపోయినాక ఆయన సాలిహ్ కేసి కాస్సేపు గంభీరంగా చూసి, "హెూ, హెూ!" అంటూ మళ్ళీ విరగబడి నవ్వాడు.

ఆ నవ్వు సంబాళించుకున్న తరవాత ఆయన, "సాలిహ్, నువ్వేమో బుద్ధిమంతుడ వనుకున్నాను. పొరపాటని రుజువయింది. నీ అసంగతమైన కోరికకు అర్థమేమైనా ఉన్నదా?" అన్నాడు.

"ఒక్కటి ఖాయంగా చెప్పగలను. బద్రబసీమ్ రాజు అందంలో గాని, సంపదలో గాని, పుటకలో గాని మీ అమ్మాయికే మాత్రమూ తీసిపోడు. మీ పిల్ల అలాటి వరుణ్ణి చేసుకోకపోతే ఇంకెలాటి వరుణ్ణి చేసుకుంటుందో నాకు బోధపడకుండా ఉంది. ఆడదానికి పెళ్ళో, గోరీయో రాసిపెట్టి ఉంటుందంటారు. మీ పిల్లను గోరీ పాలు కాకుండా చేసే ఉపాయం నేను చెబుతున్నాను. ఈ అవకాశం పోనివ్వవద్దు," అని సాలిహ్ అన్నాడు.

సమందల్ రాజుకు ఆగ్రహావేశం వచ్చింది. ఆయన, "కుక్కా, నా కూతురి పేరెత్తుతావురా? నీ మేనల్లుడెవడు? వాడి తండ్రి ఎవరు? అంతా కుక్కలు!... ఎవర్రా అక్కడ? ఈ నీచుణ్ణి పట్టుకుని ఎముకలు విరగగొట్టండి!" అని అరిచాడు.

సమందల్ భటులు సాలిహ్ పైకి కమ్ముకున్నారు. కాని అతను చలాకీగా, మెరుపులాగా, వారి మధ్యగా తప్పించుకుని, తెరిచి ఉన్న సింహద్వారం కుండా బయటికి పరిగెత్తాడు. [ముగింపు వచ్చే సంచికలో]





# పెట్టినవారికి పెట్టుకున్నంత

పూర్వం ఒక గ్రామంలో ఇద్దరు అనాథ స్త్రీలు ఒకే చోట ఉండేవారు. వాళ్ళ ఇళ్ళు వేరైనా, ఇళ్ళ కప్పులు కలిసే ఉండేవి. ఇద్దరూ ఇంచుమించు ఒకే వయసువారు. ఇద్దరికీ ఎవరూ లేరు. అయితే వారిలో ఒక పెద్ద తేడా ఉండేది: ఒకతె అచ్చంగా తన సౌఖ్యమూ, తన క్షేమమూ చూసుకునేది, రెండవ స్త్రీ ఎప్పుడూ ఇతరుల సుఖం కోరేది, ఎవరికే కష్టం వచ్చినా ఆదుకునేది.

ఈ స్త్రీ లుండే ఇళ్ళ కెదురుగా ఒక బౌద్ధ సన్యాసుల మఠం ఉండేది. అందులో ఉండే భిక్షువులు అస్తమానమూ ధ్యానం చెయ్యటమో, తమ ఆవరణలో తోట పనులు చెయ్యటమో, ప్రజలకు సహాయ పడటమో చేస్తూండేవారు. ఈ అనాథ స్త్రీలకు కూడా వాళ్ళు సహాయ పడుతూండేవాళ్ళు.

ఒకనాటి రాత్రి పెద్ద గాలివాన సాగింది. స్వార్థంగల స్త్రీ భోజనానికి కూచుని ఉండగా ఎవరో తలుపు తట్టారు. ఆమె గబగబా వంట పాత్రలు దాచి పెట్టేసి వచ్చి తలుపు తెరిచింది. "ఈ గాలివానలో ఎవడో తల దాచుకోను వచ్చి ఉంటాడు. భోజన పదార్థాలు వాడి కళ్ళ పడ్డాక తినమనకుండా ఉంటే బాగుండదు," అనుకున్న దామె.

కాని తీరా తలుపు తెరిచేసరికి బౌద్ధ సన్యాసి ఒకడు లోపలికి వచ్చాడు. వానకు తడవ కుండా అతనొక గూడ కప్పుకుని ఉండటం చేత ఆమెకు అతని ముఖం సరిగా కనిపించ లేదు. "నీ భోజనానికి అంతరాయం కలిగించినట్టున్నాను!" అన్నా డతను.

ఈ సంగతి అతనికి ఎలా తెలిసిందా అని ఆశ్చర్యపడుతూ ఆమె అతనిని భోజనం చెయ్యమని ఆహ్వానించింది. తనకు పదింతలుగా ప్రత్యుపకారం జరుగుతుందన్న నమ్మకం ఉన్నప్పుడు ఆమె చాలా దాతృత్వం కనబరిచేది.

ఆర్. కామేశ్వరరావు



సన్యాసి తనకు భోజనం వద్దన్నాడు. అతను తన కోసం ఏమైనా తెచ్చాడేమోనని ఆమె అతన్ని చాలా శ్రద్ధగా పై నుంచి కిందికి పరీక్షించింది. కాని అతని చంకలో గాని, చేతిలోగాని ఆమెకు మూట లాటిదేమీ కనిపించ లేదు. ఇప్పుడామె అతని ముఖం కేసి చూసింది. అది ఆమెకు పరిచితమైన ముఖం కాదు. ఆ ముఖం కొత్తగా కని పించటమేగాక, మామూలు బౌద్ధ సన్యాసుల ముఖాలలాగా మొరటుగా కూడా లేదు; గుడ్డి వెలుతురులో కనిపించి నంతమటుకు అది నేవళంగానూ, ప్రకాశవంతంగానూ ఉండి బుద్ధభగవానుణ్ణి జ్ఞాపకం చేస్తున్నది.

అయితే ఆమెకు బౌద్ధ సన్యాసి ముఖం కంటె అతను తనకు ఏ విధమైన సహాయం చెయ్యగోరి గాలివానలో పడి వచ్చాడో తెలుసుకోవాలన్న తహతహ జాస్తి అయింది.

"గాలివాన చాలా దారుణంగా ఉన్నది. ధనికుల ఇళ్ళు ఎంత సుఖవంతంగా ఉంటాయో ఇలాటి సమయంలో తెలిసి వస్తుంది. కాని, పాపం, దిక్కులేని వాళ్ళ ఎముకల్లో గుంజు కూడా ఈ వానకు కరడు గట్టి పోతుందిగద!" అన్నాడు సన్యాసి.

"కాదా మరి? దయాపరులు సహాయం చెయ్యకపోతే ఇలాటప్పుడు అనాథల గతి ఏం కాను?" అన్నది ఆమె.

"బిడ్డా, ఆ ఉద్దేశంతోనే నే నీ వానలో పడి ఇక్కడికి వచ్చాను," అన్నాడు సన్యాసి.

"పుణ్యాత్ముడవు, తండ్రీ!" అన్నదామె.

"దానం చేసిన వారే పుణ్యాత్ములు. అమ్మా, నీకు పుణ్యం సంపాదించుకునే అవకాశం వచ్చింది. నీ కన్న హెచ్చు కష్టంలో ఉన్న వాళ్ళను నీవీ రాత్రి ఆదు కోవాలి. ఇద్దరు దిక్కులేని వ్యక్తులు మఠానికి చేరుకున్నారు. పిడుగు పడి వారి ఇల్లు కాలిపోయింది. వారికి గల సమస్తమూ కాలిపోయింది. వాళ్ళు వయస్సు మళ్ళిన వాళ్ళు, దిక్కు లేనివాళ్ళు, ఈ గాలివానలో

చిక్కుపడిపోయారు. వాళ్ళ కివ్వాలంటే మా మఠంలో ఏమీ లేదు. ఈ రాత్రి వాళ్ళు సుఖంగా పడుకునేటందుకేమైనా ఇస్తే, తెల్ల వారగానే నీ వస్తువులు నీకు అప్పగిస్తాం," అన్నాడు సన్యాసి.

ఆమె తన చిరాకును దాచుకోలేక, "పేదరాలిని, అనాథను! ఎవరన్నా ఇస్తే పుచ్చుకోవలిసిన దాన్నేగాని, నే నేమి ఇవ్వ గలను, నాయనా? నా కంటె కలిగిన వా రెవరూ నీ కీ ఊళ్ళో కనిపించనే లేదా?" అన్నది.

"కనీసం ఒక కంబళి ఇవ్వలేవా? వాళ్ళింతసేపూ వానలో చీకి, ఉన్నారు, పాపం!" అన్నాడు సన్యాసి.

ఆవిడ గతుక్కుమన్నది. కొద్ది రోజుల క్రితం శ్రేష్ఠిగారి కూతురు పెళ్ళి జరిగి నప్పుడు ఆమె కొక మంచి కంబళి దానం చేశారు; ఆ సంగతి సన్యాసికి తెలిసింది కాబోలనుకున్నది. నూరు అరైనా దాన్ని సన్యాసికి ఆమె ఇవ్వదలచ లేదు; పాత దుప్పటి ఏదైనా దొరుకుతుందేమో చూడ టానికి ఆమె లోపలి గదిలోకి వెళ్ళింది.

రెండు మూడు దుప్పట్లున్నాయి, కాని అన్నీ గట్టివి. ఇంకా చాలా కాలం మన్నుతాయి. ఆ అనాథలు మురికివాళ్ళో,




అలగా వాళ్ళో, రోగిష్టి వాళ్ళో! మంచి దుప్పట్లు మళ్ళీ వస్తాయిగదా అని వాళ్ళ కిస్తే తిరిగి ఏ రూపంలో వస్తాయో!

ఇంతలో ఆమెకు తన చింకి గుడ్డల బొంత జ్ఞాపకం వచ్చింది. దాన్ని తాను వాడటం మానేసి చాలా కాలమయింది. తీరా దాన్ని తీసి దులిపి, మడుస్తూండగా, "ఇది కూడా అవసరానికి నిక్షేపంగా పనికి వస్తుంది! చూస్తూ చూస్తూ ఎలా ఇవ్వటం?" అనిపించిం దామెకు.

అయినా సన్యాసి వాణ్ణి ఉత్త చేతులతో పంపటానికి లేదుగనక, దాన్ని అతని కిస్తూ, "దీన్ని పక్కకు వేసుకుంటున్నా, నాయనా!

పెద్దదాన్ని, కీళ్ళ నొప్పులు రాకుండా ఇదే కాస్తున్నది," అన్నది.

"అమ్మా, వాళ్ళు కూడా నీ వయసు వాళ్ళే. పై పెచ్చు వాళ్ళకున్నదంతా పోయింది. ఇది తప్ప ఇంకేమీ ఇవ్వలేవా?" అన్నాడు సన్యాసి. తన దగ్గిర ఇవ్వటానికి ఇంకేమీ లేదని ఆమె ప్రమాణాలు చేసిన మీదట సన్యాసి వెళ్ళిపోయాడు.

అతను రెండవ స్త్రీ ఇంటి తలుపు తట్టి, లోపలికి వెళ్ళి ఆమెతో కూడా ఈమెకు చెప్పినట్టే చెప్పాడు. వెంటనే ఆవిడ తనకు శ్రేష్ఠిగారి కూతురి పెళ్ళికి వచ్చిన కంబళీ, తన వద్ద ఉన్న పక్కా, దుప్పట్లూ, అన్నీ తెచ్చి సన్యాసి ముందు పెట్టి, "ఇంకేమన్నా కావాలా, నాయనా?" అని అడిగింది.

"అది పని కొస్తుంది, ఇది పనికొస్తుంది," అంటూ సన్యాసి, ఆవిడకు ఒక్క చింకి చాప మాత్రం పడుకోవటానికి ఉంచి ఇంట గల వస్తువులన్నీ తీసుకుని వెళ్ళిపోయాడు.

అతను వెళ్ళినాక గాలివాన మరింత తీవ్రమయింది. ఒక రాత్రివేళ ఆకాశం విరిగినట్టు పెళాపెళా మని చెవులు పగిలే చప్పుడయింది. అనాథ స్త్రీ లుండే ఇంటి కప్పు పైన పిడుగు పడి కప్పు అంటుకున్నది. స్త్రీ లిద్దరూ ఎలాగో ప్రాణాలు దక్కించుకుని వానలోకి పరిగెత్తారు. అంతకు పూర్వం వచ్చిన సన్యాసి వారిద్దరికీ ఎదురొచ్చి, చెరొక చెయ్యీ ఇచ్చి, "మఠంలోకి రండి!" అన్నాడు.

మరుక్షణం వాళ్ళిద్దరూ మఠం లోపల ఉన్నారు; తాము అక్కడికి ఎలా చేరిందీ వాళ్ళకే తెలియదు.

"బిడ్డలారా, మీ వస్తువులు మీరే తీసుకోండి," అన్నాడు సన్యాసి.

"పాపం, ఆ వానలో వచ్చిన అనాథులో?" అన్నది రెండవ స్త్రీ అతనితో.

"మీరే ఆ అనాథలు!" అంటూ సన్యాసి మాయమయాడు.






# శిలావిగ్రహం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే శ్మశానం కేసి మౌనంగా నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, అలవిగాని పనిని నెత్తిన వేసుకొన్న నిన్ను చూస్తే తన శిల్పంతో తన కీడు తానే తెచ్చుకున్న శ్రీధరుడి కథ జ్ఞాపకం వస్తున్నది. శ్రమ తెలియకుండా అతడి కథ చెబుతాను విను," అంటూ ఈ విధంగా చెప్పసాగాడు:

అమరావతీ నగరంలో నయసాగరుడు తాను మహామంత్రిగా ఉండిన కాలంలో, బంధుప్రియుడు కావటంచేత తన బంధువులను ఎందరనో చేరదీసి, వారి వారి శక్తి సామర్థ్యాలనూ, అర్హతలనూ బట్టి రాజుగారి కొలువులో చిన్న, పెద్ద ఉద్యోగా. లిప్పించాడు. ఉద్యోగార్హత లేని వారికి తన ఇంటనే ఏవో పనులు కల్పించి వారిని తానే పోషిస్తూవచ్చాడు.

---

బేతాళ కథలు

ఇలా నయసాగరుడు చేరదీసిన వారిలో శ్రీధరుడనే యువకుడొకడుండే వాడు. వాడు చూడటానికి అందంగా ఉండేవాడు, మాట్లాడటం కూడా తెలివిగా మాట్లాడేవాడు. అన్ని విధాలా మంచివాడే గాని, శ్రీధరుడికి చదువు సంధ్యలు లేవు, ఏ ఒక్క విద్య లోనూ ప్రావీణ్యం లేదు. మహామంత్రి శ్రీధరుడికి చదువు చెప్పింతామనీ, ఏదైనా ఒక విద్య నేర్పింతామనీ యత్నించాడు, కాని శ్రీధరుడు అలాటి వాటిల్లో కొంచెం కూడా ఆసక్తి కనబరచలేదు. ఇంటి పనులు చేసే వారి మీదా, తోట పని చేసే వారి మీదా పెత్తనం చెయ్యమని చెబితే అది కూడా ఉపేక్షించి ఏ కొండ వాగు ఒడ్డుకో వెళ్ళి అక్కడి పరిసరాలు చూస్తూ గంటల తరబడి గడిపే వాడు.

ఇదంతా కూడా మంత్రిగారు సహించాడు. ఎందుకూ పనికిరాని వాడేనని రుజువైనప్పటికీ శ్రీధరుడంటే ఆయనకు వాత్సల్యభావం ఉండేది. కాని శ్రీధరుడు మంత్రిగారి ఏక పుత్రిక అయిన వత్సలను తాను ప్రేమించ టమేగాక, ఆమె ప్రేమను సంపాదించ టానికి కూడా యత్నిస్తున్నట్టు స్పష్ట మయింది. శ్రీధరుడు అమరావతీ నగరానికి వచ్చినప్పుడు వత్సల చిన్న పిల్ల. మొదటి



నుంచీ ఆమె శ్రీధరుడి తోనే ఎక్కువగా తిరిగేది. కాని ఇప్పుడు వత్సల ఈడేరిన పిల్ల. రాజుగారి కూతురు వత్సల ఈడుదే; ఆమెకు అప్పుడే పెళ్ళి ప్రయత్నాలు జరుగు తున్నాయి. రాజకుమార్తె పెళ్ళి అయిన మరుక్షణం వత్సలకు కూడా పెళ్ళి చేసే ఆలోచనలో ఉన్నాడు మంత్రిగారు.

అందుచేత ఆయన ఒకనాడు వత్సలను పిలిచి, "అమ్మా, నీవు వెనకటి లాగా శ్రీధరుడి వంటి ఎదిగిన మగపిల్లలతో తిరగటం అంత భావ్యం కాదు. నేడో రేపో నీ కొక మంచి సంబంధం చూసి పెళ్ళి చెయ్యవలసిన భారం నా పైన ఉన్నది.

నీ వివాహం అయేదాకా నిన్నెవరూ వేలు పెట్టి చూపే అవకాశం కలగకుండా మసులుకో," అని చెప్పాడు.

వత్సల అమాయకత్వం చేత, "శ్రీధరుడు మంచి మంచి కథలూ, కబుర్లూ చెబుతాడు. నవ్విస్తాడు. అతనితో మాట్లాడటం తప్పా, నాన్నగారూ?" అని అడిగింది.

తాను చేసిన హెచ్చరిక అర్థం చేసుకునే పాటి లోక జ్ఞానం తన కుమార్తెకు లేదని గ్రహించి మంత్రిగారు శ్రీధరుణ్ణి ఎక్కడి కైనా పంపించి వెయ్యా నిశ్చయించాడు. ఆయన ఆ కుర్రవాణ్ణి పిలిచి, "నాయనా, నీ విక్కడ సుఖంగా ఉండటం నా క్షిష్టమే గాని, ఇక్కడ ఏమీ నేర్చుకోక నీ జీవిత మంతా నిరుపయోగమవుతున్నది. అందు చేత, నీకు పుష్కలంగా డబ్బిస్తాను, ఎక్కడికైనా వెళ్ళి నీకు నచ్చిన బతుకు తెరువు నేర్చుకుని, గొప్ప వాడివై తిరిగి రా," అని చెప్పాడు.

శ్రీధరుడు వెళ్ళిపోయే ముందు వత్సలను కలుసుకుని, "నే నెందుకూ పనికి రానని మీ నాన్న అనుకుంటున్నాడు. చూస్తూ ఉండు, నా కీర్తి దేశదేశాల పాకేట్టు చేస్తాను," అని చెప్పి వెళ్ళిపోయాడు.

అతను కొన్ని రోజులపాటు దారీతెన్నూ పట్టించుకోకుండా ప్రయాణం చేసి ఒక



గ్రామం చేరుకున్నాడు. అది శిల్పు లుండే గ్రామం. కొందరు మట్టి బొమ్మలు చేసి, కాల్చి, వాటికి రంగులు వేస్తున్నారు. మరి కొందరు కొయ్య బొమ్మలు చేస్తున్నారు. కాని అందరి కన్న శ్రీధరుడికి నచ్చినవారు నల్లరాయీ, పాలరాయీ చెక్కి విగ్రహాలు తయారు చేసేవారు. అతను ఆ గ్రామం లోనే నివాసం ఏర్పాటు చేసుకుని రోజూ రాతి విగ్రహాలు చేసే వారి వద్దకు వెళ్ళి కూచుని, వాళ్ళకు సరదాగా కబుర్లు చెబుతూ, వారు చేసేదంతా చూసేవాడు. రాత్రిపూట తాను కూడా చిన్న చిన్న పాల రాళ్ళు తీసుకుని వాటిని తనకు నచ్చిన విధంగా చెక్కి తేలికైన బొమ్మలు తయారు చేసి చూసుకుంటూ వచ్చాడు.

శ్రీధరుడు ఎవరి వద్దా శిష్యత్వం చెయ్యకుండా, ఎవరినీ అనుకరించకుండా, తనకు తానే గురువై శిల్ప విద్య నేర్చుకున్నాడు. అతనికి శిల్పంలో నిజమైన ప్రావీణ్యం ఉన్నది. ఆరంభ దశలో అతను చేసిన కప్పలూ, పిల్లులూ మొదలైన బొమ్మలలో కూడా జీవం ఉట్టి పడుతూ ఉండేది. అతను నల్ల రాతితో కూడా బొమ్మలు చేశాడు గాని అతనికి నిజంగా నచ్చినది పాలరాయి. పాలరాయి తాను చెప్పినట్టు మలుగుతుందని ధైర్యం తోచినప్పు డతను





పెద్ద పాలరాయి ఒకటి కొని దానితో ఒక స్త్రీ విగ్రహం, మూరెడు ఎత్తున్నది తయారు చేశాడు. విగ్రహంలో ఉన్న స్త్రీ చిరునవ్వు నవ్వుతూ ఏదో వింటున్నట్టుగా కూచుని ఉన్నది. అది ముమ్మూర్తులా వత్సలే. తాను కబుర్లు చెబుతూంటే వత్సల అలాగే కూర్చుని ఆలకించేది. తన కబుర్లు వినే వత్సల రూపం అతని మనస్సులో శాశ్వతంగా అలాగే ఉన్నది. ఆమెనే అతను బొమ్మగా మలిచాడు.

ఆ బొమ్మ శ్రీధరుడికి పరిపూర్ణమైన సంతృప్తి నిచ్చింది. ఎంత పేరుమోసిన శిల్పులుకూడా రాతికి అలా ప్రాణం పొయ్యలేరు. తాను అసమర్థుడని ఇప్పుడిక ఎవరూ అనలేరు. ఆ నమ్మకంతో అతడు తాను తయారు చేసిన విగ్రహాన్ని వెంట పెట్టుకుని అమరావతికి వెళ్ళాడు.

శ్రీధరుడు తిరిగి వచ్చినందుకు అందరికన్న మంత్రి హెచ్చుగా సంతోషించాడు. ఎందుకంటే, తానే వాణ్ణి వెళ్ళగొట్టానన్న భావం ఆయనను బాధించింది. శ్రీధరుడు తిరిగి రావటమేగాక ఒక అపూర్వమైన శిల్పాన్ని తెచ్చాడని తెలిసి ఆయన మరింత సంతోషించాడు. శ్రీధరుడు తాను తెచ్చిన రాతి బొమ్మను ఒక బల్ల మీద పెట్టి అందరినీ చూడనిచ్చాడు. అది శ్రీధరుడే చేశాడని మొదట మంత్రిగారు నమ్మనే లేదు. కాని ఇంతలో ఎవరో, "ఇది అచ్చు మన వత్సలే!" అన్నారు. దానితో బొమ్మ చేసిన వాడు శ్రీధరుడేనని రుజువయింది.

సరిగా ఆ సమయానికే రాజకుమార్తె వివాహం జరిగింది. మంత్రిగారు పెళ్ళికూతురికి శ్రీధరుడి విగ్రహం కానుకగా ఇచ్చాడు. దాన్ని చూసి అందరూ మెచ్చుకున్నారు. ఈ విధంగా శ్రీధరుడి కీర్తి రాజభవనంలోకి పాకింది.

అయినప్పటికీ శ్రీధరుడు వత్సలను పెళ్లి చేసుకునే అవకాశం ఏమీ పెరగ లేదు.

"నా కూతురిని రాళ్ళు చెక్కుకునే వాడి కిచ్చేది కల్ల—ఎంత నేర్పరి అయితేనేం గాక!" అన్నాడు మంత్రిగారు. వత్సల ఈ మాట విని చాలా దుఃఖించింది. శ్రీధరుడు వెళ్ళిపోయిన మీదట ఆమెకు అతని ఎడబాటు దుస్సహమయింది. అతను తిరిగి వచ్చినాక ఆమెకు అతని పైన ప్రేమ రెట్టింపయింది. అతను తన బొమ్మ అంత బాగా తయారు చేసినాక అతన్ని తప్ప యితరుణ్ణి పెళ్ళాడరాదని ఆమె గట్టిగా నిశ్చయించుకున్నది.

బహిరంగంగా కలుసుకునేటందుకు లేదు గనక వారిద్దరూ ఏ అర్ధరాత్రి వేళనో ఇల్లు వదిలి వెళ్ళిపోవటానికి నిశ్చయించుకున్నారు. ఇలాటిదేదో జరుగుతుందనే మంత్రిగారు, తనను చిన్నతనంలో ఎత్తుకుని మోసిన ఒక ముసలివాణ్ణి తన కుమార్తె పై రాత్రివేళ ఒక కన్ను ఉంచమని రహస్యంగా హెచ్చరించాడు.

వత్సలా శ్రీధరులు అర్ధరాత్రి ఇల్లు కదిలి వెళ్ళిపోతూండగా ఈ ఎనభై ఏళ్ళ ముసలివాడు ఉద్యానవన ద్వారం వద్ద వారికి అడ్డుపడి, "అమ్మాయిగారూ, ఇలాటి పని చేసి నాన్నగారికి కళంకం తీసుకురాకండి. నా బొందెలో ప్రాణం ఉండగా మిమ్మల్ని



పోనివ్వను," అని వత్సల చేతులు రెండూ పట్టుకున్నాడు. శ్రీధరుడికి ఏం చెయ్యాలో తోచలేదు. ఈ ప్రయత్నం విఫలమైతే మరొక ప్రయత్నానికి అవకాశం దొరకదు. నేడో రేపో వత్సలకు ఏదో ఒక సంబంధం స్థిరం కూడా కానున్నది. అందుచేత శ్రీధరుడు ముసలివాడి చేతులు రెండూ పట్టుకుని, బలంకొద్దీ వాణ్ణి వెనక్కు తోశాడు.

ఆ తోపుతో ముసలివాడి తల ఠపీమని ద్వారబంధానికి తగిలింది. వాడు కిందపడి మరి కదలలేదు.

తరవాత వత్సలా శ్రీధరులు చాలా రోజులు ప్రయాణం చేసి ఒక దూరదేశం



చేరారు. వత్సల వంటి మీది నగలు అమ్మి కొంతకాలం జీవించిన మీదట, "నా చేతిలో విద్య ఉన్నది. అమ్ముకు తింటే నీ నగలు మాత్రం ఎంతకాలం వస్తాయి?" అన్నాడు శ్రీధరుడు. అతను నల్లరాయీ, పాలరాయీ, ఏది దొరికితే అది కొని, చిన్న చిన్న బొమ్మలు, అలంకారార్థం గూళ్ళలోనూ, ద్వారాలపైనా పెట్టుకునేవి చేసి వాటితో కాలక్షేపం చేశాడు. నలుగురూ కొనటానికి వీలుగా అతను వాటిని చౌకగానే అమ్మేవాడు.

వారు వచ్చి ఎంతోకాలం కాకముందే వారి కొక వార్త తెలిసింది: శ్రీధరుడి పై హత్యానేరం ఆరోపించబడింది, అతనికి



మరణదండన కూడా ప్రకటించారు, అతని కోసం వెతుకుతున్నారు. ఈ వార్త తెలియగానే శ్రీధరుడు వత్సలతో సహా దక్షిణ దేశానికి బయలుదేరాడు. వత్సల గర్భవతి. ప్రయాణం చాలా నింపాదిగా చెయ్యవలసి వచ్చింది. ఎన్నో శ్రమలుపడి మూడు మాసాల అనంతరం వారొక పెద్ద నగరం చేరుకున్నారు.

"ఇక్కడ మనని ఎవరూ తెలుసుకోలేరు. పూర్వంలాగా నా విద్యను యిక మరుగుపరుచుకో నవసరం లేదు," అన్నాడు శ్రీధరుడు.

ఇక్కడ అతనికి జీవితం సుఖంగానే ఉన్నది. అయితే అతనికి పాలరాయి బహు అరుదుగా దొరికేది. అందుచేత దొరికిన రాళ్ళతోనే విగ్రహాలు చేసి మంచి శిల్పి అని పేరు తెచ్చుకున్నాడు.

వత్సల మగబిడ్డను ప్రసవించింది. ఆమె సుఖానికి ఇప్పుడే లోటూ లేదు. తన కొడుక్కు ఒక్కొక్క నెలే గడిచిన కొద్దీ ఆమె ఆనందం హద్దు మీరి ప్రవహిస్తున్నది. ఈ సమయంలో శ్రీధరుడొక పాలరాయి సంపాదించి దానితో తన భార్యా బిడ్డల విగ్రహం తయారు చేశాడు. బిడ్డను చేతిలో పట్టుకుని వాడితో పాటు తాను కూడా నవ్వుతున్న



వత్సల విగ్రహంలో అవతరించింది. విగ్రహం పూర్తి అయినదాకా అతను దాన్ని వత్సలకు చూపలేదు. తీరా చూసినాక ఆమెకు సంతోషంతో బాటు భయం కూడా పట్టుకున్నది. దాన్ని ఎవరైనా చూస్తే, మారు పేరుతో బతుకుతున్న శ్రీధరుణ్ణి తెలుసు కుంటారు. అందుచేత ఆమె ఆ విగ్రహాన్ని అటక మీద దాచేసింది.

ఒకరోజు శ్రీధరుడి దుకాణానికి ఒక ఉత్తర దేశస్థుడు వచ్చాడు. అతను శ్రీధరుడి శిల్పాలన్నీ ఎంతో పరీక్షగా చూసి, "మా ఉత్తర దేశపు శిల్పాల కివి ఏ మాత్రం చాలవు!" అన్నాడు.

శ్రీధరుడికి రోషం వచ్చి లోపలికి వెళ్ళి అటక మీద ఉన్న బొమ్మ తెచ్చి, "మీ ఉత్తర దేశంలో ఇంత కన్న సజీవంగా విగ్రహాలు చెక్కుతారా?" అని అడిగాడు.

"అద్భుతం! అద్భుతం! దీన్ని ఎంతకు అమ్ముతారు?" అన్నాడు ఉత్తర దేశస్థుడు. తన ఎత్తు ధనం పోసినా దాన్ని అమ్మ నన్నాడు శ్రీధరుడు.

ఉత్తర దేశస్థుడు వెళ్ళిపోయాడు. మరి కొంచెం సేపటికి అతను కొందరు భటులతో తిరిగి వచ్చి, "ఇతడే హంతకుడు శ్రీధరుడు! ఇతన్ని పట్టుకుని అమరావతికి తీసుకు పోండి," అన్నాడు. అతను శ్రీధరుడికి



రాజుగారి ఫర్మానా చూపి, "నేను నిన్ను గుర్తించలేదు గాని, విగ్రహంలో వున్న మంత్రిగారి కుమార్తె పోలికలు గుర్తించాను," అన్నాడు.

"నేను మీ వెంట రావటానికి సిద్ధంగానే ఉన్నాను. నా భార్యతో సామాన్లు సర్దుకుని రెండు ఘడియలలో సిద్ధమవుతాను," అంటూ శ్రీధరుడు లోపలికి వెళ్ళాడు. అతను భార్యకు శాశ్వతంగా వీడ్కోలు చెప్పి, దొడ్డి దారిన ఎటో పారిపోయాడు. అతని జాడ మరి తెలియరాలేదు.

రాజోద్యోగి వెంట వత్సల తన కొడుకుతో సహా తండ్రి ఇంటికి వచ్చేసింది. ఆమె యావ జ్జీవమూ అక్కడే ఉండిపోయింది. మంత్రిగారి హాలు మధ్య బల్ల మీద పెట్టి ఉన్న విగ్రహాన్ని అందరూ ఆశ్చర్యంతో చూసి ఆనందించే వారు. "దాన్ని చేసింది నా అల్లుడే! గొప్ప శిల్పి!" అని మంత్రి అనే వాడు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, నా కొక్క సందేహం. శ్రీధరుడు తన శిల్పాన్ని యితరు లెవరికీ చూపెట్టకుండా దాచుకున్నట్టయితే అతనికి బోలెడంత సుఖం దక్కేది గద! తన సుఖాన్ని తన చేతులారా ఎందుకు మట్టు పెట్టుకున్నాడు? దీనికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలి పోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "మానవుడు కేవలమూ సుఖం కొరకే బతకలేడు. ప్రతి భావంతుడు తన ప్రాణం కన్నా ప్రతిభనే హెచ్చుగా పరిగణిస్తాడు. సుఖం లాగా కాక ప్రతిభ శాశ్వతమైనది. దాని కోసం ప్రతి భావంతుడు సుఖాన్నీ, ప్రాణాలనూ కూడా త్యాగం చెయ్యటం ఎంత మాత్రం అస్వాభావికం కాదు," అన్నాడు.

రాజు కీ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. (కల్పితం)






# మూఢుడూ-మోసగాడూ

ఒక మూఢుడు ఒక మోసగాడితో స్నేహం కట్టి సహజీవనం సాగించాడు. దానినిబట్టే వాడు మూఢు డనుకోవచ్చు. మూఢుడి దగ్గిర కొంత డబ్బున్నది, మోసగాడి దగ్గిర ఏమీ లేదు.

"మన డబ్బు ఒకేసారి ఖర్చుపెడితే, ఒకరు ఎక్కువ ఖర్చుపెట్టారనీ, ఒకరు తక్కువ ఖర్చుపెట్టారనీ తగాదా వస్తుంది. అందుచేత ముందు నీ డబ్బు ఖర్చుచేసి, అది అయిపోయినాక నాది ఖర్చుచేద్దాం," అన్నాడు మోసగాడు. ఇందుకు మూఢుడు సరే నన్నాడు.

త్వరలోనే మూఢుడి డబ్బు ఖర్చయి పోయింది. "నా డబ్బు ఒకచోట పాతి పెట్టాను, తెస్తా నుండు," అని వెళ్ళిన మోసగాడు తిరిగివచ్చి శోకాలుపెడుతూ, "అయ్యో, నా డబ్బంతా ఎవరో కాజేశారు. ఇప్పుడేం చెయ్యాలి?" అన్నాడు.

"ఏడవకు! ఏంచేస్తాం? డబ్బు పంచు కున్నట్టే పేదరికం కూడా పంచుకుందాం. అయితే మనం ఏదైనా పని చేసుకుంటే తప్పు జరుగుబాటు కాదు," అన్నాడు మూఢుడు.

"నీ మాట నిజం. నీకేం పని చేత నవును? పొలం పని చెయ్యగలవా? కుండలు గాని, వడ్రంగం గాని, నేత గాని చెయ్యగలవా? తాపీ పనీ, దర్జీ పనీ, రంగులు వేసే పనీ వచ్చునా?" అని మోసగాడు అడిగాడు.

తనకు ఏదీ రాదని మూఢుడు చెప్పాడు.

"నాకు కూడా నీలాగే ఏ పనీ చేతకాదు. అందుచేత మనం బతుకు తెరువు వెతు క్కుంటూ దేశం మీద పోదాం," అన్నాడు మోసగాడు.

ఇద్దరూ కలిసి బయలుదేరారు. పోగా పోగా ఒక కొండ వచ్చింది. కొండ దిగువన

జి. కోటేశ్వరరావు



ఒక విరిగిన బండీ ఉన్నది. దాని మీద పెద్ద పెట్టె ఉన్నది. బండి పక్క ఒక ధనికుడు నిలబడి ఉన్నాడు. ఆ ధనికుడు వీళ్ళను చూసి, "బలంగా కనిపిస్తున్నారు. ఈ పెట్టెను కొండ ఎక్కించి అవతలి పక్క దించితే మీకు చెరొక బంగారు కాసూ ఇస్తాను," అన్నాడు.

"చూశావా, పని దొరికింది. పెట్టె ఎత్తు," అన్నాడు మోసగాడు.

ఇద్దరూ పెట్టెను భుజాల మీదికి ఎత్తుకుని నడవ నారంభించారు. "మనిద్దరమూ స్నేహితులం. అందుచేత నీకు అన్యాయం జరగటం నేను సహించలేను. మనం కొండ ఎక్కాలి, తరవాత దిగాలి. ఎక్కటం కష్టం దిగటం తేలిక. అందుచేత కొండ ఎక్కేటప్పుడు నేను ముందు నడుస్తాను. దిగేటప్పుడు నువు ముందు నడు," అన్నాడు మోసగాడు.

వాడు చెప్పిన ప్రకారం ఎక్కేటప్పుడూ, దిగేటప్పుడూ కూడా తన మీదనే ఎక్కువ బరువు పడుతుందని తెలియక, మూఢుడు తన మిత్రుడి ఔదార్యానికి ఎంతో సంతోషించాడు. బరువులో మూడు వంతులు వాడి పైనే పడింది. కొండ అవతల ఒక సత్రం ఉన్నది. పెట్టెను సత్రంలోకి చేర్చగానే ధనికుడు వాళ్ళకు రెండు బంగారు కాసులిచ్చాడు.

సత్రంలో సుఖంగా ఉండటంచేత మిత్రులిద్దరూ ఆ రెండు కాసులూ ఖర్చయిపోయినదాకా సత్రంలోనే ఉన్నారు. ఆ తరవాత సత్రం యజమాని దగ్గిర అప్పు పెట్టారు. ఇక అప్పు కూడా పుట్టదని తెలిసినాక ఒకనాడు చీకటితో, సత్రం యజమాని యింకా నిద్ర లేవక మునుపే, లేచి ప్రయాణం సాగించారు.

తిండిగాని, పనిగాని దొరకకుండా వాళ్ళు చాలా దూరం ప్రయాణించినాక ఒక చోట దారి పక్కన ఒక మనిషి రాళ్ళు పగల

గొట్టుతూ కనిపించాడు. వాడి పక్కన ఒక దుత్తలో చద్దీ, చిన్న గరిటె ఉన్నాయి. ఆ మనిషి వాళ్ళ కేసి చూసి, "ఆకలి మీద ఉన్నట్టున్నారు. నాకు మరో చోట పని ఉన్నది. మీరీ రాళ్ళ కుప్ప అంతా పగల గొట్టి ఈ దుత్తలో చద్ది తినెయ్యండి. తరవాత దుత్తా, గరిటె ఆ కనబడే కంచె దగ్గిర పెట్టెయ్యండి, నేను వచ్చి తీసుకుంటాను," అన్నాడు.

ఇందుకు ఇద్దరూ సమ్మతించారు. ఆ మనిషి వెళ్ళిపోయాడు.

మోసగాడు మూఢుడితో, "ఆకలి వల్ల నీరసంగా ఉన్నాం. ముందు తిండి తిని, బలం తెచ్చుకుని, తరవాత రాళ్ళు కొట్టుదాం. న్యాయం న్యాయమే. ఉన్నది ఒక గరిటె గనక ఒకరి తరవాత ఒకరం తిందాం. నువ్వెన్ని గరిటెలు తింటే నేనూ అన్నే తింటాను. కొండ దిగినప్పుడు నువు ముందున్నావు, చూడూ. అందుచేత ఇప్పుడు ముందు వంతు నా కిచ్చెయ్యి," అన్నాడు.

"అది న్యాయమే!" అన్నాడు మూఢుడు.

మోసగాడు ఒక్కొక్క గరిటె లెక్కపెట్టి చద్ది తింటూ, దుత్తలో మూడో వంతు కాగానే, "ఇక నీ వంతు," అని గరిటెనూ, దుత్తనూ మూఢుడి కిచ్చేశాడు. మూఢుడు



కూడా గరిటెలు ఎంచుతూ తన మిత్రుడు తిన్నన్ని గరిటెలే తిని దుత్తను వాడి కిచ్చేసి, "నీ వంతు," అన్నాడు. మోసగాడు కూడా గరిటెలు ఎంచుతూనే తిన్నాడుగాని, తీరా మూఢుడి వంతు వచ్చేసరికి దుత్తలో ఏమీ లేదు. తనకు జరిగిన మోసమేమిటో కూడా మూఢుడికి తెలియరాలేదు.

తరవాత రాళ్ళు కొట్టే పని వచ్చింది.

"సుత్తె ఒకటే గనక ఒకరి తరవాత ఒకరం రాళ్ళు కొట్టాలి. కిందటిసారి నాది మొదటి వంతు గనక ఈసారి నీది మొదటి వంతు. నువు కొన్ని రాళ్ళు కొట్టాక నేను సుత్తె తీసుకుంటాను. నా తరవాత మళ్ళీ



నీవూ, నీ తరవాత మళ్ళీ నేనూ—అలా రాళ్ళయిపోయినదాకా కొడదాం," అన్నాడు మోసగాడు.

"నిజంగా నీది ఎంత న్యాయ బుద్ధి!" అని మెచ్చుకుంటూ మూఢుడు రాళ్ళు కొట్టటానికి కూచున్నాడు. రాళ్ళలో మూడో వంతు కాగానే మోసగాడు సుత్తె తీసుకుని తాను కూడా ఒక మూడో వంతు కొట్టాడు. తరవాత మళ్ళీ మూఢుడి వంతు వచ్చింది. తిరిగి మోసగాడి వంతు వచ్చేసరికి రాళ్ళన్నీ అయిపోయాయి.

వాళ్ళు అక్కడి నుంచి బయలుదేరి నడక సాగించారు. కొంత దూరం వెళ్ళాక ఒక చేనులో ఒక రైతు కనిపించాడు. అతను వాళ్ళను చూసి, "మీ యిద్దరూ పొద్దు గుంకిన దాకా చేలో పిట్టలను తోలా రంటే రాత్రికి తిండి పెట్టి, పడుకునే టందుకు చోటిస్తాను," అన్నాడు.

"నేను చేను బయట ఉండి పిట్టల్ని దూరం నుంచే తరిమేస్తాను. నువు చేను మధ్య ఉండి, నన్ను తప్పించుకు వచ్చిన పిట్టలను తరిమెయ్యి," అన్నాడు మోసగాడు. మూఢుడు సరేనన్నాడు. మోసగాడు పొలం చివరకు వెళ్ళి, కంచె నీడన పడుకుని హాయిగా నిద్రపోయాడు. సాయంకాలం దాకా మూఢుడు చప్పట్లు చరచలేకా, కేకలు పెట్టలేకా సతమత మయాడు.

రాత్రి ఇద్దరూ భోజనం చేసేటప్పుడు మూఢుడు మోసగాడితో, "అమ్మో, ఈ పని చాలా కష్టం. రైతుతో గొర్రెల్ని కాచ నివ్వ మందాం. అది తేలిక పని. రోజల్లా కొండ మీద పడుకోవచ్చు. పక్షులు వచ్చి గొర్రెల్ని ఎత్తుకుపోవు. చప్పట్లూ, కేకలూ అవసరం లేదు," అన్నాడు.

మోసగాడు ఈ సూచనను సంతోషంతో ఆమోదించాడు. మర్నాడు ఇద్దరూ గొర్రెల వెంట గుట్టల మీదికి వెళ్ళారు. గొర్రెలు మేత ఆరంభించాయి. గొర్రెల కాపరి కుక్క

ఒక చోట కూచున్నది. ఇద్దరూ వెల్లికిలా పడుకుని నిద్రపోయారు.

వాళ్ళు సాయంకాలం లేచి చూసేసరికి కనుచూపు మేరలో ఒక్క గొర్రె లేదు. వాటిని మళ్ళించుకు రావటానికి కుక్క కూడా వాటితో వెళ్ళింది.

"గొర్రెలను నువ్వటు నుంచి మళ్ళెయ్యి, నే నిటు వెళ్ళి మళ్ళేస్తా. అంతకన్న ఉపాయం లేదు. తిరిగి ఇద్దరమూ మళ్ళీ ఇక్కడే కలుసుకుందాం," అన్నాడు మోసగాడు.

ఇద్దరూ చెరొక వైపూ బయలుదేరారు. మోసగాడు వెళ్ళినట్టే కొంతదూరం వెళ్ళి, మళ్ళీ వెనక్కు తిరిగి వచ్చి యథాస్థానంలో పడుకున్నాడు. కొంతసేపటికి కుక్క గొర్రె లన్నిటినీ మళ్ళించి తెచ్చింది. తరవాత మూఢుడు రాగానే, "ఏమైనావు? గొర్రె లన్నిటినీ నేనే తెచ్చాను," అన్నాడు మోసగాడు.

ఆ రాత్రి మూఢుడు తన మిత్రుణ్ణి, "నా కీ పని కూడా కష్టమే అనిపిస్తున్నది. ఇంత కన్న తేలికైన పని ఏమీ ఉండదా?" అని అడిగాడు.

"ముష్టెత్తగలవా? అంతకన్న సుఖమైన వృత్తి ఉండదు. నడవటమూ, వాగటమూ



తప్ప మరే శ్రమా ఉండదు. నడకైనా నీ యిష్టం వచ్చినప్పుడే నడవచ్చు, అడిగే వాడుండడు. మాట్లాడట మంటావా, ఒకింటి దగ్గిర పాడిన పాటే అన్ని ఇళ్ళ దగ్గిరా పాడవచ్చు. హెచ్చు తగ్గు లుండకుండా నువ్వు ఇంటి ముందు ముష్టెత్తు, నే నింటి వెనక ముష్టెత్తుతా," అన్నాడు మోసగాడు.

మూఢుడు సరే నన్నాడు. వాడు బక్క చిక్కి ఉండటం చేత దాతలైన వాళ్ళు వాడికి ముష్టి వేశారు. ఈ లోపుగా మోసగాడు ఇంటి వెనక పక్కకు వెళ్ళి ఒక కోడినో, బాతునో, ఏది దొరికితే అది దొంగిలించాడు. ఇద్దరూ కలుసుకున్నప్పుడు వాడు

మూఢుడితో, "ముష్టి రాగి డబ్బులు సంపాదించావా? నేను చూడు ఏం సంపాదించానో!" అన్నాడు.

ఈ విధంగా రెండు మూడు చోట్ల జరిగినాక మోసగాడు తన సంపాదనలో తన మిత్రుడికి వంతివ్వ నిరాకరించి, "నీకు బిచ్చ మెత్తటం ఏమీ చేత కాలేదు. అస్తమానమూ నేనే నిన్ను పోషించట మవుతున్నది," అన్నాడు.

మూఢుడు విచారంతో కుంగిపోయి, "పోనీ ఇక నుంచీ నీవే ఇళ్ళ ముందు అడుక్కో, నేను దొడ్ల వెంట అడుక్కుంటాను," అన్నాడు. అందుకు మోసగాడు సరే నన్నాడు. అలా చేసినా కూడా మూఢుడు ముష్టెత్తిన దాని కన్న మోసగాడు దొంగిలించినదే జాస్తిగా ఉంటూ వచ్చింది.

ఒకనాడు వాళ్ళు పొలాల మధ్య ఉన్న ఒక ఇంటికి వెళ్ళారు. మూఢుడు ఇంటి ముందు నిలబడి బిచ్చం వెయ్యమని అరిచాడు. ఈలోపుగా మోసగాడు వెనకపక్కకు వెళ్ళి ఒక బాతునూ, వేరుశనగకాయలనూ దొంగిలించాడు.

మూఢుడు ఉత్త చేతులతో రావటం చూసి మోసగాడు, "నీ కీ బాతులో కొంచెం కూడా ఇవ్వను. వట్టి సోమరి వెధవవు! అడుక్కోను కూడా లేవు! పో, నీ తిండి నువు తెచ్చుకో!" అంటూ ఒక చోట కూచుని, వేరు శనగకాయలు ఒలుచుకుని తినసాగాడు. మూఢుడు ముందుకుసాగాడు.

ఈలోపుగా మోసగాడు చేసిన దొంగతనం ఇంటివాళ్ళు కనుక్కున్నారు. వాళ్ళు పొలాల్లో పని చేసే వాళ్ళని పదిమందినీ కేకేసి పరిగెత్తుకుంటూ వచ్చారు. మోసగాడు వాళ్ళకు దొంగిలించిన వస్తువులతో సహా దొరికి పోయాడు. నలుగురూ చేరి వాణ్ణి మెత్తగా తన్ని న్యాయాధికారి దగ్గిరికి తీసుకు పోయారు. న్యాయాధికారి వాడికి జైలు శిక్ష విధించాడు.





# సుందరకాండ

జాంబవంతుడు ప్రోత్సాహం ఇవ్వగా హనుమంతుడు రామముద్రికతో సహా లంకకు దాటి, రావణుడు సీతను ఉంచిన స్థలం కనిపెట్ట నిశ్చయించుకున్నాడు. అతను శరీరాన్ని పెంచి, మహేంద్రగిరి పైన అటూ ఇటూ తిరుగుతూ, పెద్ద వృక్షాలను తన రొమ్ముతో కూలదోస్తూ, మృగాలను చంపుతూ కొంతసేపు సంచరించాడు. బయలుదేరే ముందు అతను సూర్యుడికీ, ఇంద్రుడికీ, వాయుదేవుడికీ, బ్రహ్మకూ నమస్కారాలు చేసి, మహేంద్రపర్వతం మీద చేతులూ, కాళ్ళూ ఆనించి ఒక్క ఊపు ఊపాడు. చలనం ఎరగని మహేంద్ర పర్వతం ఆ ఊపుకు కంపించిపోయింది. దాని మీది శిలలు బద్దలయాయి. గుహలలో ఉండే ప్రాణులు ఆర్తనాదాలు చేశాయి. పర్వతం మీద ఉండే విద్యాధరులు కంగారుపడి ఆకాశంలోకి ఎగిరారు. ఋషులూ, చారణులూ, సిద్ధులూ హనుమంతుడు సముద్రాన్ని లంఘించి లంకకు వెళ్ళే యత్నంలో ఉండటం గురించి మాట్లాడుకోసాగారు.

హనుమంతుడు తన శరీరం మీది రోమాలను విదిల్చి, ఒక్క పెడబొబ్బ పెట్టాడు; ఒకసారి దూరం కేసీ, ఒకసారి ఆకాశం కేసీ చూసి, తన సమీపంలో ఉన్న జాంబవంతుడు మొదలైన వారితో, "నేను రామబాణం లాగా వేగంతో లంకకు పోతాను,



అక్కడ సీత కనిపించకపోతే అదే వేగంతో స్వర్గానికి వెళతాను. అక్కడ కూడా సీత లేని పక్షంలో తిరిగి లంకకువెళ్ళి, ఆ రావ ణుణ్ణి బంధించి ఇక్కడికి తెస్తాను. అదృష్టం కలిసివస్తే సీతను తెస్తాను. లేదా, రావ ణుడితో సహా లంకనే పెల్లగించి యిక్కడికి తెస్తాను," అన్నాడు.

ఈ మాట చెప్పి హనుమంతుడు ఆకాశం లోకి ఎగిరాడు. హనుమంతుడు ఎగిరిన వేగానికి పెద్దపెద్ద మానులు అతని వెన కగా గాలిలో లేచి కొంతదూరం ఎగిరి, తర వాత సముద్రంలో పడిపోయాయి. దూర ప్రయాణం మీద బయలుదేరే వాణ్ణి బంధు వులు కొంతదూరం సాగనంపినట్టుగా ఆ చెట్లు హనుమంతుణ్ణి వెంబడించాయి. అవి పడిపోయిన తరవాత కూడా వాటి పూలు మరికొంత దూరం హనుమంతుడి వెంట వెళ్ళాయి.

దక్షిణ దిక్కుగా హనుమంతుడు అతి వేగంగా సముద్రం మీదుగా పోతూ ఉంటే, అతని చేతుల సందుగా వెళ్ళే గాలి గొప్ప రొద చేసింది. అతను లంకకు చేటు సూచించే తోకచుక్కలాగా లంక కేసి వెళ్ళాడు. అతని వేగానికి అతనికి దిగువగా ఉండే సముద్రంలో పెద్ద తరంగాలు కల్లో లంగా లేచాయి. అతని నీడ సముద్రం మీద పది ఆమడల వెడల్పునా, ముప్పై ఆమడల పొడుగునా పడింది.

ఇలా సముద్రం మీదుగా వెళ్ళే హను మంతుణ్ణి చూసి దేవతలు మెచ్చారు. సముద్రుడికి కూడా హనుమంతుడికి తోడ్ప డాలనే ఆలోచన కలిగింది. ఎందుకంటే సముద్రుణ్ణి వృద్ధిపొందించిన సగరుడు ఇక్ష్వాకువంశం వాడు. అదే వంశంలో పుట్టిన రాముడి పని మీద హనుమంతుడు వెళు తున్నాడు. ఇక్ష్వాకు వంశానికి తన కృతజ్ఞత చూపుకోవాలంటే సముద్రుడికి యిది మంచి అవకాశం.





అందుకని సముద్రుడు తనలో దాగి ఉన్న మైనాకపర్వతంతో, "ఓ మైనాకుడా, పాతాళంలోని రాక్షసులు పైకి రాకుండా అడ్డం ఉన్న నీ కిప్పుడు చిన్నపని చెబుతాను. వానర శ్రేష్ఠుడైన హనుమంతుడు రాముడి పని మీద అత్యంత సాహసంతో లంకకు ఎగురుతూ ఇటుగా వస్తున్నాడు. నీకు పైకీ, పక్కలకూ కూడా పెరిగే శక్తి ఉన్నది గనక, నీటి పైకి పెరిగి ఆ హనుమంతుడికి కాస్సేపు విశ్రాంతి ఇయ్యి. నీ పైన కాస్సేపు విశ్రమించిన మీదట హనుమంతుడు మిగిలిన దూరం మరింత తేలికగా వెళ్ళగలడు," అన్నాడు.

అప్పుడు బంగారు శిఖరాలు గల మైనాక పర్వతం సముద్రుడు కోరిన ప్రకారం ఆకాశంలోకి పెరిగింది. దాని బంగారు శిఖరాలు నూరు సూర్యుళ్ళలాగా వెలిగాయి.

ఆకస్మికంగా తన దారికి అడ్డంగా పెరిగిన ఆ మైనాకాన్ని చూసి హనుమంతుడు, "ఇది నా పనికి విఘ్నంచెయ్యాలనే దుర్బుద్ధితో నా దారికి అడ్డంగా లేచింది," అనుకుని ఆ పర్వతాన్ని తన రొమ్ముతో ఒక్క తోపు తోసేసరికి, అది పక్కకు పడిపోయింది.

తనను సునాయాసంగా పడదోసిన హనుమంతుడి వేగానికి మైనాకు డెంతో సంతోషించి, మానవరూపం ధరించి ఒక శిఖరంపై నిలబడి, "వానరవీరుడా, నీవు అసాధ్యమైన సముద్ర లంఘనం చేస్తూ కూడా, కొంచెమైనా అలియకపోగా, నన్ను పడదోశావు. నా శిఖరం మీద కాస్సేపు విశ్రమించు. ఒకప్పుడు రాముడి పూర్వీకుడైన సగరుడూ, అతని కొడుకులూ సముద్రుడికి మహోపకారం చేశారు. అందుచేత రాముడి పని మీద వెళ్ళే నీకు కొంత సహాయంచేసి ఇక్ష్వాకులకు ప్రత్యుపకారం చెయ్యాలని సముద్రుడి కోరిక. అందుచేత నీకు విశ్రాంతి కలిగించమని సముద్రుడు నన్ను కోరాడు. నా మీద నిలిచి, అలసట



తీర్చుకుని కందమూలఫలాలు ఆరగించి మరీ వెళ్ళు. ఏ అతిథి అయినా పూజ నీయుడే అన్నప్పుడు, నీ వంటి అతిథి మాట వేరే చెప్పాలా? నీవు మహాపండితుడవు, అది అలాగుంచి, వాయుదేవుడి కుమారుడవు. నేను వాయుదేవుడికి ఋణపడి ఉన్నాను. ఎలాగంటే: కృతయుగంలో పర్వతాలన్నిటికీ రెక్కలుండేవి. అవి వేగంగా గాలిలో ఎగురుతూ ఉండేవి. అందుచేత వాటిని చూసి దేవతలూ, ఋషులూ కూడా భయపడ్డారు. అప్పుడు దేవేంద్రుడు వజ్రాయుధంతో పర్వతాల రెక్కలు అనేకవేల సంఖ్యలో తెగవేశాడు. నా రెక్కలు కూడా తెగవేయటానికి ఇంద్రుడు రాగా, నీ తండ్రి అయిన వాయుదేవుడు నన్ను అతివేగంగా తీసుకుపోయి ఇంద్రుడి బారినుండి కాపాడాడు. ఆయన దయ వల్ల నా రెక్కలు దక్కాయి. అందుచేత నీవు కాదనకుండా, నేనూ, సముద్రుడూ చేసే ఆతిథ్యాన్ని స్వీకరించాలి," అని చెప్పాడు.

దానికి హనుమంతుడు, "చాలా సంతోషం! నీ మాటలే నాకు ఆతిథ్యం. మీ ఆతిథ్యాన్ని నిరాకరించి నందుకు మీరు కోపగించ వద్దు. కార్యార్థినైన నేను విశ్రాంతి తీసుకోవటం అసాధ్యం. రామబాణంలాగా లంకకు పోతానని వానరులకు మాట ఇచ్చాను," అంటూ మైనాకుణ్ణి తన చేతితో తాకి, సంతోషం తాండవించే ముఖంతో ముందుకు సాగాడు. "నీకు కార్యసిద్ధి అగుగాక!" అని సముద్రుడూ, మైనాకుడూ అతన్ని దీవించారు.

హనుమంతుడు అక్కడి నుంచి ఆకాశంలోకి మరింత ఎత్తుగా ఎగిరి ముందుకు సాగాడు. మైనాకు డిచ్చిన ఆశ్రయాన్ని నిరాకరించి దీక్షతో లంకకు వెళ్ళే హనుమంతుడికి దేవతలు పరీక్షపెట్ట గోరి, పాములకు తల్లి అయిన సురస వద్దకు వెళ్ళి,



"వాయుపుత్రుడైన హనుమంతుడు సముద్రం మీదుగా ఎగురుతూ లంకకు పోతున్నాడు. నీవు భయంకరాకారం ధరించి అతని దారికి అడ్డం తగులు. అతను నిన్ను జయించి పోతాడో, నిన్ను చూసి భయపడతాడో చూడగోరుతున్నాం. అతని పరాక్రమం ఎంతటిదో తెలుసుకోవాలని మా అందరి కోరిక," అన్నారు.

సురస వారి కోరిక తీర్చటానికై కొండంత రాక్షసరూపం ధరించి, పెద్ద కోరలతోనూ, గోరోజనం రంగుగల కళ్ళతోనూ భయంకరంగా తయారై, హనుమంతుడి దారికడ్డంగా నిలబడి, "హనుమంతుడా, నిన్ను భక్షించటానికి దేవతలు నాకు అనుజ్ఞ ఇచ్చారు. కనక నీవు నా నోట్లోకి ప్రవేశించు," అన్నది.

హనుమంతుడు సురసకు నమస్కారం చేసి, నవ్వుతూ, "రాముడు వనవాసం చేస్తూండే సమయంలో, ఆయన లేనప్పుడు రావణుడు ఆయన భార్య అయిన సీతను ఎత్తుకు పోయాడు. నేను రాముడి దూతగా ఇప్పుడు సీత వద్దకు పోతున్నాను. రాముడి రాజ్యంలో ఉండే దానివే గనక నీవుకూడా రామకార్యానికి తోడ్పడాలి. కాదంటావా, రాముడి వద్దకు వెళ్ళి అనుమతి పొంది, నీ నోట ప్రవేశిస్తాను. ఇందుకు నా కేమీ అభ్యంతరం లేదు," అన్నాడు.

సురస ఆ మాటకు జవాబివ్వక, "నన్ను దాటి ఎవరూ వెళ్ళలేరు. ఆ విధంగా నాకు వరం ఉన్నది. నా నోటి ముందుకు వచ్చిన వాడు తప్పించుకు పోలేకుండా నాకు బ్రహ్మ వరమిచ్చాడు. కనక నా నోట ప్రవేశించు," అంటూ నోరు తెరిచి హనుమంతుడి ముందు నిలబడింది.

ఈ మాటకు హనుమంతుడు అలిగి, "అయితే నన్ను మింగేటంతగా నోరు తెరు!" అంటూ, తన శరీరాన్ని పది ఆమడల ప్రమాణానికి పెంచాడు. వెంటనే సురస తన నోటిని ఇరవై ఆమడల ప్రమాణానికి

పెంచింది. హనుమంతుడు కోపంతో తన దేహాన్ని ముప్పై ఆమడలకు పెంచాడు. సురస తన నోటిని నలభై ఆమడలు చేసింది. హనుమంతుడు తన శరీరాన్ని యాభై ఆమడలకు పెంచాడు.

ఈ విధంగా పోటీ పడటంలో హనుమంతుడి శరీరం తొంభై ఆమడలూ, సురస నోరు నూరామడలూ అయాయి.

అకస్మాత్తుగా హనుమంతుడు తన శరీరాన్ని వేలంతదిగా చేసి, తూనీగలాగా సురస నోట్లో ప్రవేశించి మళ్ళీ బయటికి వచ్చి, "ఓ సురసా, బ్రహ్మదేవుడు నీ కిచ్చిన వరం సార్థక మయింది. నీ నోటి ఘుందుకు వచ్చిన నేను నీ నోట ప్రవేశించాను. ఇంతటితో నన్ను వదిలిపెట్టు. సీత ఉండే చోటికి వెళ్ళాలి," అన్నాడు.

సురస రాక్షస రూపం విడిచిపెట్టి మామూలు రూపు ధరించి, "వెళ్ళి రా, నాయనా. నీకు విజయం కలుగుతుంది. రాముణ్ణీ సీతనూ తిరిగి కలుపు!" అని చెప్పి తన నివాసానికి వెళ్ళింది.

హనుమంతుడు తిరిగి ప్రయాణం సాగించాడు. ఆకాశంలో ఎగిరి పోయే హనుమంతుణ్ణి సింహిక అనే రాక్షస జంతువు సముద్రంలో ఉండి చూసింది. అది ఆకలితో ఉండటం చేత హనుమంతుణ్ణి తినగోరి, అతని నీడను పట్టుకుని ఈడ్చింది. తనను ఎవరో వెనక్కు లాగేస్తూండటం గమనించి హనుమంతు డాశ్చర్యపోయి, అటూ, ఇటూ, అన్ని పక్కలా చూసేసరికి సముద్రం మీద సింహిక కనిపించింది. అది తన నీడను పట్టుకుని ఉండటం చూడగానే హనుమంతుడికి సుగ్రీవుడు ఎప్పుడో అన్న మాట జ్ఞాపకం వచ్చింది. దక్షిణ సముద్రంలో ఒక వింత జంతు వున్నదనీ, అది నీడను పట్టుకోగలదనీ సుగ్రీవు డన్నాడు. అదే ఇది అయి ఉంటుందని హనుమంతు డనుకున్నాడు.



సింహిక శక్తి ముందు హనుమంతుడి పరాక్రమం ఎందుకూ పనికి రాలేదు. అది అతన్ని తన కేసి ఈడ్చుకున్నది. హనుమంతుడు తన శరీరాన్ని అపారంగా పెంచాడు. అందుకు తగ్గట్టుగానే సింహిక కూడా భయంకరంగా నోరు తెరిచింది. ఆ తెరిచిన నోటి కుండా హనుమంతుడు దాని శరీరంలోని మర్మస్థానాలు గమనించి, తన శరీరాన్ని చిన్నదిగా చేసి, లోపలికి ప్రవేశించి, సింహిక మర్మాలు చీల్చేసి, అది తిరిగి నోరు మూసే లోపుగా బయటికి వచ్చేసి, తన శరీరాన్ని పెద్దది చేసుకున్నాడు. సింహిక గుండెలు చీలిపోయి స్పృహ తప్పి చచ్చి, నీటిపై తేలింది. చచ్చిన సింహికనూ, చంపిన హనుమంతుణ్ణీ చూసి ఆకాశంలో సంచరించే భూతాలు ఎంతో సంతోషించి, హనుమంతుణ్ణి కీర్తించాయి.

హనుమంతుడు మళ్ళీ బయలుదేరాడు. కొంత సేపటికి అతనికి సముద్రపు అవతలి తీరం కనిపించింది. అక్కడ అడవు లున్నాయి. పోయినకొద్దీ లంకా ద్వీపమూ, అక్కడి వనాలూ, చెట్లూ మరింత బాగా కనిపించాయి. లంకలోని నదులు సముద్రంలో వచ్చి పడటం కనిపించింది.

తన దేహం ఇంకా పెద్దదిగానే ఉండటం హనుమంతుడికి జ్ఞాపకం వచ్చింది. లంకలోని రాక్షసులు అంత శరీరంతో ఉన్న తనను చూశారంటే హాహాకారాలు చేసి, అందరికీ చెబుతారు; అప్పుడు తాను వచ్చిన పని కాస్తా పాడైపోతుంది. అందుచేత హనుమంతుడు తన దేహన్ని చిన్నదిగా చేసుకున్నాడు.

ఆ శరీరంతో అతను ఆలంబపర్వతం మీద దిగాడు. దాని మీద విరిగిచెట్లూ, మొగలి పొదలూ, కొబ్బరిచెట్లూ ఉన్నాయి. ఎత్తుగా త్రికూటపర్వతం పైన లంకానగరం కనిపిస్తున్నది. అది దేవేంద్రుడి అమరావతీ నగరంలాగున్నది.



# 24. అబూ సింబెల్

ఈజిప్టు దక్షిణపు కొనను గల అబూ సింబెల్ దేవాలయాలు (రెండు) ప్రాచీన ఈజిప్షను శిల్ప కళకు అమోఘ నిదర్శనాలు. కొండలో మలిచిన ఆలయ ద్వారాలలో గల ప్రతిమలు రెండవ రామిసెస్‌వి. వాటి ఎత్తు 65 అడుగులు. దాదాపు 3,200 ఏళ్ళ క్రితం రామిసెస్ ఈ ఆలయాలు చెక్కించాడు. రెండవ రామిసెస్ క్రీ. పూ. 1318 లో జన్మించి 1232 లో 86 వ ఏట మరణించాడు.






1. జి. హనుమంతరావు, శ్రీకాకుళం

"గద్ద జాతివాణ్ణి కావటంచేత ఇక్కడి నుండే రావణుణ్ణీ, సీతనూ చూడ గలుగుతున్నాను," అని సంపాతి అన్నాడు. గద్దలకు కూడా ఆ కాలంలో దూర దృష్టిగలదా?

ఏ కాలంలోనైనా గద్దలకు దూరదృష్టి ఉన్నది. దూరదృష్టి అంటే దివ్యదృష్టి కాదు.

2. ఆర్. రామారావు, పిఠాపురం

"రాకాసిలోయ", "కిష్కింధాకాండ"—ఈ రెండు కథలు చదివిన తరువాత గాని ఉన్న కథలు చదవ బుద్ధికావటంలేదు. కాని మీరు ఈరెండు కథలు చాలా తక్కువగా ప్రచురించుచున్నారు. ఈ కథలు కాస్త హెచ్చించ మని మా స్నేహితుల తరఫున నేను కోరుచున్నాను.

ఈ రెండూ రంగుల బొమ్మల కథలు. వాటిని ఎనిమిదేసి పేజీలు వెయ్యటానికి మాత్రమే మాకు సౌకర్యం ఉంది.

3. జి. ప్రమీలాదేవి, ఎడ్లపల్లి

చందామామా, నీవూ (?), సూర్యుడూ ఎల్లప్పుడూ కర్కాట మఖరరేఖల మధ్యే తిరుగుతారు. ఆ రేఖలను దాటి పోరేమిటి?

తిరుగుతున్నది సూర్య చంద్రులు కావు, భూమే. దాని ఇరుసు ఒరిగి ఉండటంచేత అది సూర్యుణ్ణి చుట్టి వచ్చేటప్పుడు ఒక సమయంలో కర్కాట రేఖా, మరొక సమ యంలో మకర రేఖా సూర్యుడికి సూటిగా రావటం జరుగుతుంది. సూర్య చంద్రులు ఈ రేఖలను దాటి పోయినట్టు కనిపించాలంటే భూమి ఇరుసు ఇంకా ఏటవాలుగా ఉండాలి.

ఇతర గోళాల నుంచి చూస్తే (ఒకవేళ మనుష్యులుంటే!) భూమికూడా మెరుస్తూ కనబడుతుందా?

కనబడుతుంది. భూమి ప్రతిఫలించే సూర్యకాంతి సహాయంతోనే మనం శుద్ధ విదియ, తదియలలో చంద్రగోళాన్ని పూర్తిగా చూడగలుగుతున్నాం.

చంద్రునిలో లాగా సూర్యునిలో కూడా మచ్చ ఉన్నదా?

చంద్రుడిలో ఉండే మచ్చలకూ, సూర్యుడిలో ఉండే మచ్చలకూ చాలా తేడా ఉన్నది. చంద్రుడిలో మచ్చలు నైసర్గిక స్వరూపాన్ని సూచించేవి; సూర్యుడిలో మచ్చలు సుడి గుండాల లాగా ఏర్పడి మళ్ళీ నమసిపోయేవి.

4. *జి. వి. శ్రీధర్, మద్రాసు*

మామా! ఈసారి "చందమామ" దీపావళికి ప్రత్యేక సంచికగా వెలువడే సూచనలేమీ కనబడలేదు, కారణం?

ఈసారి "చందమామ" దీపావళి ప్రత్యేక సంచిక వెయ్యటంలేదు.

5. *వేముల మల్లయ్య, గుడివాడ*

అన్నయ్యా, ఫిబ్రవరి 1962 సంచికలో "రాకాసిలోయ" 1962 ఆఖరుకు అయిపోతుందని చెప్పియున్నారు. అప్పుడే ఎందుకు పూర్తి చేయలేదు.

"రాకాసిలోయ" ముగించ వద్దని ఇప్పటికి కూడా డజన్లకొద్దీ ఉత్తరాలు వస్తున్నాయి.

6. *ఎస్. ఎన్. ఎం. సాహెబ్, తాటిపాక*

ఇదివరకు మీరు అట్టమీది బొమ్మ కథ వ్రాసేవారు, మానేసినారేమండీ?

రామాయణం అట్టమీది బొమ్మ కథే.

7. *తటవర్తి చంద్రశేఖరరావు, నడిగూడెం*

అగస్టు నెల "చందమామ"లో ప్రచురించబడిన "యుక్తిగల కళాసు" కథ కాపీ కథ. ఈ కథ 7-11-1956 వ తేదీగల—పత్రికలో "మాయ కత్తి" అనే పేర శ్రీ—గారు రచించినారు.

అది ఈ దేశంలో ఎవరు రచించినదీ కాదు, బర్మా కథ. ఆ విషయం "యుక్తిగల కళాసు"లోని మొదటి వాక్యమే స్పష్టం చేస్తున్నదిగద.

8. *ఎస్. సీతా మహాలక్ష్మి, విజయవాడ*

రామాయణ మంతయు ఒక పుస్తకముగా అచ్చు వేయించి ఉన్నారా? డబ్బు పంపినచో నా కొక ప్రతి పంపగలరా?

రామాయణం ఇంత త్వరలో పుస్తకంగా వెలువడదు. "చందమామ" సంచికల నుంచి ఎవరి రామాయణం వారు తయారు చేసుకోవటం మంచిది.

# ఆకాశానికి ఫొటోలు

అమెరికాలో పాలోమార్ పర్వతం మీద ప్రపంచంలో కెల్లా పెద్దదైన "200 అంగుళాల" హేల్ టెలిస్కోపు వున్నది. దాని సహాయంతో 100 కోట్ల కాంతి సంవత్సరాల దూరాన ఉండే నక్షత్ర కూటాలను కూడా చూడవచ్చు. పాలోమార్ పర్వతంపైనే 48 అంగుళాల టెలిస్కోపు గల ష్మిత్ కామెరా ఉన్నది. ఈ కామెరాతో అకాశంలో ముప్పాతిక భాగానికి 1758 ఫొటోలు తీశారు. ఇవి తీయటానికి 7 సంవత్సరాలు పట్టింది. 600 కాంతి సంవత్సరాల దూరంలో—అంటే 3 కోట్ల 60 లక్షల కోట్ల కోట్ల మైళ్ళ దూరంలో—ఉండే ప్రతి నక్షత్రమూ ఈ ఫొటోలలో ఉన్నది. ఉత్త కంటికి కనిపించే అతి తక్కువ కాంతి గల నక్షత్రాల కన్న పది లక్షల రెట్లు తక్కువ కాంతి గల నక్షత్రాలు ఈ ఫొటోలలో ఉన్నాయి.

చాలా హెచ్చు దూరం చూడగల హేల్ (200 అంగుళాల) టెలిస్కోపు ఉండగా, అకాశానికి ఫొటోలు తియ్యటానికి ష్మిత్ కామెరా టెలిస్కోపును ఎందుకు ఉపయోగించారు? దానికి కారణం లేకపోలేదు. హేల్ టెలిస్కోపు ఎక్కువ దూరం చూస్తుందన్న మాటే గాని, ఆకాశంలో బహు కొద్ది మేర మాత్రమే చూస్తుంది. దానితోనే ఆకాశాన్ని ఫొటోగ్రాఫు చేసినట్టయితే, ఈ పని 7 ఏళ్ళలో గాక 10,000 ఏళ్ళలో ముగిసి ఉండేది.

తొలి అంచనాల ప్రకారం ఈ ఫొటోలు తయారు చెయ్యటానికి 4 ఏళ్ళు పట్టి ఉండవలసింది. కాని అనేక అవకతవకలు జరిగాయి. ఈ ఫొటోలు తీయటానికి పూనుకున్నవారు ప్రతి ఫొటో కూడా స్పష్టంగానూ, నిర్దుష్టంగానూ ఉండాలని పట్టు పట్టారు. తీసిన ఫొటోలలో నూరింట 45 అవతల పారేశారు.

అకాశానికి ఫొటోలు తియ్యాలన్న యోచన డా. బొవెన్ అనే సుప్రసిద్ధ నక్షత్ర శాస్త్రవేత్తది. ఆయన పర్యవేక్షణ కిందనే ఫొటోలు తయారయాయి. డా. ఆల్బర్ట్ విల్సన్, రాబర్ట్ హారింగ్టన్, జార్జ్ ఏబెల్ మొదలైన వారు స్వయంగా ఫొటోలు తీశారు. ఈ ఉద్యమంలో అమెరికాలోని నేషనల్ జియోగ్రాఫిక్ సొసైటీ వారి సహకారం ఉండింది. ఈస్ట్‌మన్ కొడాక్ కంపెనీ వారు ఫొటోలు తీయడానికి ప్లేట్లు తయారు చేసి ఇచ్చారు.

ఈ ఫొటోల వల్ల ఉపయోగం ఏమిటి? ఒక ఉపయోగం కాదు, అనంతమైన ఉపయోగాలున్నాయి. వాటిలో ఒకటి రెండు తెలుసుకుందాం.

ఉన్నట్టుండి మామూలు నక్షత్రం ఒకటి "పేలుతుంది." దాని కాంతి పూర్వం ఉండినద్దానికి కొన్ని కోట్ల రెట్లు హెచ్చుతుంది. వాటిని "నవ్య తారలు" అంటారు. అలాటి తారయొక్క పేలుడు శక్తి హైడ్రొజెన్ బాంబు పేలుడు శక్తి కన్న 10 వేల కోట్ల, కోట్ల, కోట్ల రెట్లుండవచ్చు! ఉదాహరణకు, 1952 లో ష్మిత్ కామెరాతో "ఎన్. జి. 5668" అనే సంకేతం గల గెలాక్సీని (నక్షత్ర కూటాన్ని) ఫొటోగ్రాఫు చేశారు. 1954 లో హేల్ టెలిస్కోపు అదే గెలాక్సీలో ఏర్పడిన నవ్యతారను ఫొటోగ్రాఫు చేసింది. ఈ విధంగా భవిష్యత్తులో

నవ్యతారలు ఏర్పడటం నక్షత్ర పరిశీలకులు గమనించి ఫొటోలు తీసినప్పుడు, పూర్వం వాటి కుండిన కాంతి తెలియటం వల్ల వాటి "పేలుడు"కు కారణాలు గ్రహించే అవకాశం ఉంటుంది. పైన చెప్పిన ఆకాశపు ఫొటోలు అందుకు ఉపకరిస్తాయి.



బాణం గుర్తుగల "నవ్యతార" 1954 లో ఏర్పడినది.

ఈ 1758 ఫొటోల లోనూ ఆకాశం 20 వ శతాబ్ది మధ్యకాలంలో ఎలా ఉండిందీ శాశ్వతంగా రికార్డయి ఉన్నది. భవిష్యత్తులో నక్షత్రాల పొందిక మొదలైన వాటిలో కలిగే మార్పులన్నీ ఈ ఫొటోల సహాయంతో తెలుసుకోవచ్చు. ఈ ఫొటోలు ప్రపంచంలోని నక్షత్రవేత్త లందరికి నూరేళ్ళపాటు పని కలిగిస్తా యంటున్నారు. అందులో అతిశయోక్తి లేక పోవచ్చు. ఎందుకంటే, అనేక కోట్ల కొత్త నక్షత్రాలూ, నక్షత్ర కూటాలూ, "తేజో మేఘాలూ" మొట్ట మొదటి సారిగా ఫొటోగ్రాపు అయాయి.

ఆకాశంలో నక్షత్రాలు గెలాక్సీలుగా కూడుకుంటాయి. ఇలాటి గెలాక్సీలు కొన్ని చేరి ఒక సముదాయంగా ఏర్పడతాయి. ఆకాశం నిండా ఈ గెలాక్సీల సముదాయా లున్నాయి. ఇవి ఏ సూత్రం మీద ఏర్పడతాయో ఎవరికి తెలియదు. ఆ రహస్యం తెలుసుకోవటానికి ఈ ఫొటోలు సహాయపడవచ్చు.

రేడియో టెలిస్కోపుల ద్వారా భూమికి ఊహకు అందనంత దూరాల నుంచి ధ్వనులు వస్తున్నవి. ఈ ధ్వనులను చేసే ప్రాంతాలు అదృశ్యంగా ఉన్నట్లు కనిపిస్తాయి. కాని ఒక్కొక్కప్పుడు వాటిని కనిపెట్టి ఫొటోగ్రాపు చేయవచ్చు.

## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫొటోల వ్యాఖ్యలు 1964 జనవరి నెల సంచికలో ప్రకటింపబడును.





★ పై ఫొటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ నవంబర్ నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫొటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

## నవంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: నిన్ను విడువదు నీడ

రెండవ ఫోటో: నింగి కెగిరిన కూడ

పంపినవారు: కె. ఇందిరాదేవి,

మెడికల్ కాలేజి, గుంటూరు.

బహుమతి మొత్తం రు. 10/– ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. NAGI REDDI at the B. N. K. Press Private Ltd., and Published by B. VENUGOPAL REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'

దీపావళీ శుభసమయాన
మా అభిమానులు అందరకూ

అభినందనము లర్పిస్తున్నాము





అందమైన ముద్రణకు

## నెల్‌సన్ టైపులనే



ఉపయోగించండి



# నెల్‌సన్ అండ్ కో

**(ది ఫైన్ ఆర్ట్ టైప్ ఫౌండ్రీ)**

స్థాపితము: 1916

చూళై: మద్రాసు - 7. ఫోన్: 33122

ఫ్యాక్టరీ:—నం. 1, నెల్సన్ మాణిక్యమొదలియార్ రోడ్డు,
అమింజికరై, మద్రాసు - 29. ఫోన్: 62036



"చందమామ" నెల్‌సన్ టైపులతోనే ముద్రింపబడుతున్నది.




# బ్రిటానియా
# గోల్డెన్ పఫ్




బ్రిటానియా వారే ప్రత్యేకంగా తయారుచేసే యీ గోల్డెన్ పఫ్ బిస్కట్లు తాజాగా కరకరలాడుతూ వుండి తృప్తినిచ్చును. కాఫీ, టీ, త్రాగేటప్పుడు సేవించుటకు అనువైనవి. జామ్, వెన్న, జున్నులతో కూడ సేవించవచ్చును. రుచి చూడండి — నోట్లో కరిగిపోతాయి. నేడే కొనండి. కమ్మగా రుచిగా వుండే యీ తాజా బ్రిటానియా గోల్డెన్ పఫ్ బిస్కట్లను సేవించి ఆనందించండి.

## బ్రిటానియా
## బిస్కట్లు

JWTBC 5910 A








పండుగ సమయాలలో కుట్టు మెషీన్లు బహుమానంగా యిచ్చే ఈ క్రొత్త అలవాటు ఎందుకు ఏర్పడింది? మీ కుటుంబము వాటిమీద మోజుపడి వాటిని పొగడుతారనా? మీ ప్రేమ పాత్రులు వాటిని మెచ్చుకొని, ప్రేమించి, వాటితో కాలక్షేపము చేస్తారనా? తప్పకుండా, నిజమేను. అంతేకాక, ఇవి భాగ్యపు చిహ్నాలు. తరుణమునకు తగిన బహుమానము— మీ కుటుంబమునకు. ఈ సంవత్సరము క్రొత్త ఉషా స్ట్రీములైన్డ్ మాడెలుతో మీ కుటుంబమునకు ఆశ్చర్యము కలుగజేయుడు—ఇవి నలభయికి ఎక్కువ విదేశములలో వాటి సొగసైన డిజైనుకు, కార్య పటుత్వమునకు పొగడ్త నందినవి. భారతదేశమందిప్పుడు మొదటి సారిగా అమ్మబడుచున్నవి.

**ఉషా**
కుట్టు మెషీను

జే ఇంజనీరింగ్ వర్క్సు లిమిటెడ్, కలకత్తా—31.

JEEM/73

# దగ్గును దూరం చేసు కోనండి

సేవించండి.

## వాటర్‌బరీస్ కాంపౌండు | ఎర్ర లేబిలు




– కేవలం నివారిణియే కాదు

నమ్మికమైన టానిక్కు కూడా!

వాటర్‌బరీస్ కాంపౌండు మీద, తరతరాలుగా, కుటుంబాలు నమ్మకముంచి ఆధారపడడానికి గల అనేక మంచి కారణాలలో నాలుగింటిని ఈ క్రింద ఉదహరిస్తున్నాము.

1. వాటర్‌బరీస్ కాంపౌండు దగ్గులను సత్వరం ఫలప్రదంగా నిర్మూలిస్తుంది.
2. వాటర్‌బరీస్ కాంపౌండులో క్రియోసోట్ మరియు గయాకోల్ గలవు. అవి వాయు తిత్తులను శుభ్రపరుస్తాయి.
3. వాటర్‌బరీస్ కాంపౌండు నివారిణియేగాక నమ్మకమైన టానిక్కు కూడా. శరీరప్రతిఘటన శక్తిని పెంపొందించడంలో సాయపడుతుంది.
4. వాటర్‌బరీస్ కాంపౌండు ఆకలిపుట్టిస్తుంది. జీర్ణముగుటలో సాయపడుతుంది. రక్తమును శుభ్రపరుస్తుంది. మరియు ఖనిజలవణముల నష్టమును భర్తీ చేస్తుంది.

## వాటర్‌బరీస్ కాంపౌండు | ఎర్ర లేబిలు



వార్నర్-లేంబర్ట్ పార్మసూటికల్ కంపెనీ (పరిమితమైన బాధ్యతలలో యు ఎస్ ఎలో స్థాపితము)

## రక్షణ కృషికి సంబంధించిన విషయాలకై చదవండి...




# ఆంధ్రప్రదేశ్

ఇటీవల ప్రవేశ పెట్టిన అనేక నూతన శీర్షికలకు తోడు రాష్ట్రంలోని ఉన్నతాధికార వర్గంయొక్క యుదార్థాభిప్రాయాలను, ఇంగ్లీషు, తెలుగు, ఉర్దు, హిందీ భాషలలో వెలువడే ఆంధ్రప్రదేశ్ మాస పత్రికలో ప్రచురించడం జరుగుతున్నది.

దేశరక్షణ సన్నాహం కృషికి, వివిధ రంగాలలో ప్రజలు జపుపుతున్న కృషికి సంబంధించిన అనేక వ్యాసాలు కూడా ఇందులో ఉంటాయి.

వీటికితోడు ఉత్తేజాన్ని, ఆనందాన్ని, కలిగించే కథలు, గేయాలు మొదలైన అనేక అంశాలుకూడా ఉంటాయి.

దాదాపు వందమంది ఏజంట్లతో రాష్ట్రంలోని అన్ని జిల్లాలలోనూ, మారుమూల గ్రామీణ ప్రాంతాలలో కూడా 'ఆంధ్రప్రదేశ్' పత్రిక అధికంగా సర్క్యులేటు అవుతున్నది. అంతేకాక దేశంలోని ఇతర రాష్ట్రాలకూ, విదేశాలకూ ఎక్కువ సంఖ్యతో ప్రతులు వెళ్తున్నాయి. అందువల్ల అన్నిరకాల ఉత్పత్తులకు చెందిన ప్రకటనలకు ఇది లాభం చేకూర్చుతుంది.

వార్షిక చందా రు. 3-00 మాత్రమే. ఏజంట్లవద్ద గానీ, హైద్రాబాదులోని సమాచార పౌర సంబంధాల శాఖనుంచి గానీ పత్రికను పొందవచ్చు. జిల్లాలలోని జిల్లా ప్రజా సంబంధాధికారులకు కూడా మీ చందా చెల్లించవచ్చు.

—స. పౌ. సం. శా. ఆం. ప్ర.




# మాజ్డా దీపాలతో దీపావళిని శోభాయమానం చేసుకోండి

